# కృష్ణలహరి

డా॥ ధారా రామనాథశాస్త్రి

మధుమతి పబ్లికేషన్స్
ఇ. కె. నివాస్, మామిడిపాలెం
ఒంగోలు – 523001.

అన్నిహక్కులు రచయితవి.

ద్వితీయ ముద్రణము :
విభవ మహాశివరాత్రి మార్చి 1989.



ముఖచిత్రం : శ్రీ గంగాధర్



మూల్యం : 10-00



మధుమతి పబ్లికేషన్స్
ఇ.కె. నివాస్, మామిడిపాలెం
ఒంగోలు - 523 002.
ఫోన్ : 2453.



ముద్రణ : భారత్ ప్రింటర్స్,
సంతపేట, ఒంగోలు.

2 JAN 1990



గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరంబ్రహ్మ తస్మై శ్రీగురవేనమః

పూజ్యగురుదేవులు కులపతి

**డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్య**

దివ్యస్మృతికి



# స్మృతిగీతి

నేలనుండి నింగిదాక
నీకట్టిన మెట్లెన్ని ప్రభూ
నింగి నుండి నేలదాక
దిగివచ్చిన మెట్లెన్ని?
ఏబది యెనిమిది మెట్లకె
ఎదో కధ వినిపించెన?
నేల నింగి తాకుచోట
నెలవొక్కటి కనిపించెన?
అయిదువేల యేళ్లపిదప

అవతరించినావందురు
నీ కథనో నీ రచననో
నిఖిల జగతి వినిపింపగ
వ్యాఖ్యానము ముగియకుంత
హృదయస్థము రవిప్రఖ్య
మరల పుడమి పొడముటకై
తెరమరుగునకరిగినేమొ
మనిషి మనిషి గుండెనిండ
కలకండలు నిండజేసి
ప్రతిమనిషికి కన్నులలో
వెన్నెల వేదికలు కట్టి
ఎదలోపల గుడిలోపల
పదిలమైన మహావాక్య-
గుట్టు చూపి తట్టిలేపి
వైఖరి ఝురులై యురుకగ
మానస హంసలను పెంచి
మధురముగా పలికించితి
మధ్యలోన గాంధారం
మాట వినలేవా ఋషీ

తీగెసాగి మ్రోగి మ్రోగి

ఆగిపోయె ఋతంభర

చిన్ముద్రలు చిలికించే

చిద్గగనము చివళ్లందు

త్రికోణాంతర దీపిక

కాపురమేగితివ స్వామి?

ఆ ముచ్చటు మెచ్చుగునా మేమిచ్చుటపొగలుచుండ

ఏ మిచ్చిన దిగివత్తువు? మాకై యేమేమి తెత్తు?

వేదవేదాంగముల వేయివిధముల వాక్కు

మనిషి కన్నుల నీరు తొలిగించు తొలిఋక్కు

ఆరోగ్యమొసగు నీ అమృత హస్తస్పర్శ

దర్శనమ్మున జనుల ధన్యులొనరించుచూపు

కుందమందారముల గుస్తరించెడు నవ్వు

కుందనపుటందాలు కుప్పపోసిన మేను

ఎప్పుడీ సంభారముల యొప్పు వీడకు స్వామి

వేళ తప్పక మరల వేవేగ దిగిరమ్ము

ఎప్పుడును తెరపడని గొప్ప నాటకమందు

గర్భసంధికి అలసి గగనమున దాగినను

మరల తెర తీసెదము

నాందిగీతము పాడి

తెరలు తొలిగించుకొని
దిగిరమ్మా నా స్వామీ!
అలలు ఆగిన కడలి బడలికలు చాలునిక
కలలు మూగిన కనుల కలవరము వలదింక
రెక్కతునిగిన పక్కి రెక్కలెదుగవలెను
మూగవోయిన వీణె మరల మ్రోగగవలెను
నింగికిని నేలకును
నూరు మెట్లనుకట్టి
నూరు మెట్లకు వెండి
జలతారు పూతనిడి
ఋతుగానముగ నిత్య
ఋతు గానముగ సత్య
శ్రుతి మేళమున నెల్ల
వేళ మొరయుగరమ్మ



# ముద్రణవ్యయదాత



శ్రీపొలిశెట్టి శ్రీహరిగుప్త, వారి సతీమణి శ్రీమతి సుభద్రావతి.

# పరివేషము

– డా. నండూరి రామకృష్ణమాచార్య
(అధ్యక్షులు, అధికారభాషాసంఘము, ఆంధ్రప్రదేశ్)

శ్రీకృష్ణుడు – కేవలం ఒక సాహిత్యపాత్ర అని భావిస్తే – అట్టి పాత్ర విశ్వసాహితీ జగత్తులో నిరుపమాన సృష్టి.

శ్రీకృష్ణుడు – ఒక చారిత్రక వ్యక్తి అని అనుకుంటే – అట్టి వ్యక్తి ప్రపంచ చరిత్రలో "నభూతో నభవిష్యతి" – అని అనిపిస్తుంది.

శ్రీకృష్ణుడు – అవతార పురుషుడు – లీలా మానుష వేష ధారి – జగన్నాటక సూత్రధారి అని సంభావిస్తే?? పరబ్రహ్మ తత్త్వం అవాఙ్మానసగోచరం అనుభవైక వేద్యం అన్నారుగదా వేదాంతులు.

శ్రీకృష్ణుని సంపూర్ణ సమగ్ర వ్యక్తిత్వాన్ని – తన భావాంబర వీథిలో సాక్షాత్కరింప చేసుకున్న క్రాంతదర్శులలో పేర్కొన దగినవారు –

శ్రీ ధారా రామనాథ శాస్త్రి మహర్షి.

తెలుగుతల్లి పులకరించేటట్లుగా సాహితీ చరిత్ర పునరావృత్తమయింది - ఒంగోలు గడ్డమీదనే ఒకనాడు గీర్వాణ వాణిలో వెల్లివిరిసింది శ్రీకృష్ణలీలాతరంగిణి.

నేడు తేటతెలుగు పలుకుబడిలో "కృష్ణలహరి" గేయ ప్రబంధం అవతరించింది. ఈకృతికర్త డాక్టర్ ధారా రామనాథ శాస్త్రిగారు సంగీత సాహిత్య నాట్య కళలకు ముయ్యేల గుట్ట. ఈయన నవీన జంగమ త్రివేణీ కళాసంగమం. శిల్ప సౌష్టవంలో సంస్కృత కవితకంటె తెలుగు కవిత మేల్తరము. యతిప్రాసలు కలిగి అజంత భాషయైన తెలుగుకవిత గానమునకు మృదంగ నినాద సౌనః పున్య మధురిమలు సంతరించి పెట్టగలదు. తెలుగు గేయ రచనలోయతి ప్రాసలతో పాటు అనుప్రాసలు అంత్యాను ప్రాసలు తాళలయలు చోటుచేసుకుంటాయి. తెలుగు గేయ కవిత సహజ కవచ కుండలాలతో సద్యోయావన స్ఫూర్తితో ఉద్భవించే మించు తీగ. "కృష్ణలహరి" గేయ ప్రబంధం తెలుగు జలతారు మేలిముసుగు వేసుకొని పునరుద్భవించిన శ్రీ కృష్ణలీలా తరంగిణి.

శ్రీ ధారా రామనాథశాస్త్రిగారు అపర నారాయణ తీర్థులు.

శ్రీనారాయణ తీర్థులయెడ ధారావారికిగల భక్తిప్రపత్తులు కృష్ణలహరి గేయ ప్రబంధంలోని ప్రతిపంక్తిలో స్వయం

వ్యక్తమౌతున్నవి. అయితే శ్రీ రామచంద్రుని కంటె ఆంజ నేయుడే అధికుడు అనే ఆర్ద్రహృదయులు ఉన్నారు. అట్లే నారాయణ తీర్థుల వారికంటె – శ్రీ ధారా రామనాథ శాస్త్రి గారు అధికులు అని మురిసిపోయే సాహితీ ప్రియం భావుకులు భావియుగయుగాంతరాలలో పలువురుఉంటారని నానమ్మకం.

ఇక్కడ తెలుగు నేల నాలుగు దశదిశాంతరాళాలలో ధారావారి తెలుగు గేయాలు సంగీత నాట్యరంగాలలో రసజ్ఞులను ఉత్తూత లూగింపగలవు.

"కృష్ణలహరి" గేయకృతి భాగవతసారము. కర్మయోగం కంటకావృతము. జ్ఞాన యోగమునకు శాంతిలేదు. అష్టాదశ పురాణములు మహాభారతం వ్రాసిన పిమ్మట – "కాతరు డై వడిన్" వగచుచున్న పరాశరాత్మజుడు వేదవ్యాసుడు మనశ్శాంతికై భాగవతం వ్రాశాడట. ఇనుము విరిగెనేని ఇనుమారు ముమ్మారు అతుకవచ్చును గాని "మనసు విరిగినేని" – మరి మాటు వేయటం కుదరదుగదా అని వాపోయాడు యోగి వేమన. విరిగిన మనస్సులు అతుక్కునే అమృత రసాయనం ప్రసాదించేది భాగవతం.

రామాయణం "దీర్ఘ శరణాగతి" అంటారు శ్రీవైష్ణవ వేదాంతులు. మహాభారతం సుదీర్ఘ మహాప్రస్థానమే. ధారావారు

ప్రసాదించిన కృష్ణలహరి లోని ప్రతిగేయం ఒక
శరణాగతి". ఆ గేయకవిత ఆధ్యాత్మికశాంతి సరస
అమృత సరస్సులో క్షణమాత్రం ఓలలాడిన వారు
జీవన్ముక్తులు కాగలరు. ఇది ఒకఅక్షర తపస్సు. ఇ
నాదబ్రహ్మోపాసన. ఇది ఒక అమృత రసారాధన

— "రసో వై సః —

హైదరాబాదు
24-2-89 డా. నంపూరి రామకృష్ణమా

"పరివేషము" ప్రసాదించి ఆశీర్వదించిన డాక్టర్
రామకృష్ణమాచార్యులవారికి అయిదుపది

— ధారా రామనాథ

# విషయ సూచిక

# నివేదన.

జన్మాంతర సంస్కారాలూ బాల్య సంస్కారాలూ కొంత కాలం నిద్రాణంగా ఉండి ఎప్పుడో అదనుచూచుకొని బయట పడుతుంటాయి. చాలా చిన్న తనంలో నాకు కలిగిన మొదటి స్పర్శ కృష్ణతత్త్వానికి సంబంధించింది. తాతగారు, మేనత్తగారు నాకు మాటలు వచ్చీ రాని నాళ్ళలోనే గీతా శ్లోకాలు చెప్పించి ముద్దుచేసే వారట. చిన్నప్పుడు నాన్నగారు వేసిన కృష్ణపాత్ర తాలూకు చిత్రం ఒకటి నామనస్సు మీద ముద్రవేసింది. బాల్యానికి సంబంధించి ఒకవ్యక్తియొక్క మొట్టమొదటి జ్ఞాపకం ఆ వ్యక్తియొక్క భావి జీవితాన్ని తీర్చిదిద్దేదిగా వుంటుందని మనస్తత్వ వేత్తలు చెబుతారు.

ఆ దరిమిలా చినగంజాం. వేటపాలెం, చీరాల గ్రామాలలో చదువుకున్నప్పుడు నేను తాతగారి ఆజమాయిషీలో పెరిగాను. ఆయన లౌకిక, పారలౌకికాలను సమపాళంగా నడుపుకున్న బ్రహ్మణ్యులు. నా చేత త్రికాల సంధ్యావందనం చేయించడం, అప్పుడప్పుడూ కొన్నిమంచి విషయాలు చెబుతుండటం ఆ కాలంలో జరిగింది. అది నా రెండవ స్మృతి ఖాండాపం. అందుచేత రెండవ సంస్కారం క్రింద ఈసద్గోష్ఠిని చెప్పవచ్చు.

అటుపైన చదువుకు గుంటూరు చేరినపుడు 1949 లో గురుదేవులు ఏక్కిరాల కృష్ణమాచార్యుల వారి పాదం పట్టడం. ఆ పట్టింది పట్టి విడవరాదు. అన్నట్లు నేటికి కొనసాగడం చెప్ప దగ్గ అంశాలు. తొలుతతెలుగు చెప్పే ఉపాధ్యాయునిగ నా జీవితంలోకి ప్రవేశించిన ఆ గురుమూర్తి ఉపదేష్టగా, అధివక్తగా ప్రస్తుతం పరతత్త్వ ప్రతీకగా నాకు భాసిస్తున్నారు.

ఒంగోలులో అధ్యాపక వృత్తికి కుదురుకున్న చాలా ఏళ్లకి 1970లో ఏదైనా విషయంపై పరిశోధన చేసి డాక్టరేటు పట్టం పుచ్చుకుందామని అభిలాష కలిగినప్పుడు అలా అని గురుదేవులతో చెప్పుకున్నాను. వారు ఆమోదించి ఆంధ్ర విశ్వ విద్యాలయంలో అప్పటి ఆచార్యులైన కె.వి.ఆర్. నరసింహం గారికి దఖలు పరిచారు. మా ముగ్గురి మధ్య ఏ విషయమైతే పరిశోధనకి అనువుగా ఉంటుంది. అనే సమస్య మూణ్ణెల్లకాలం తెగలేదు. చివరకు ఏదో శుభముహూర్తాన గురుదేవులే కాబోలు "కృష్ణకథ" అయితే బాగుంటుందని సూచించారు అంతే. ఆ మాట మంత్రింలాగ నన్ను ముగ్ధుణ్ణి చేసింది. అయిదేళ్లపాటు ఆరాధన బుద్ధితో, అనన్య దృష్టితో అనుశీలనం చేసేట్టుగా ఆకట్టుకొన్నది. ఆ అయిదేళ్ల కృషిలో రచయితలు, కవులు, మహాకవులు, దార్శనికులు అయినవాళ్ల కృష్ణకథా కావ్యాలు ముఖ్యం తెలుగులో ఉన్నవి కొన్ని చదవడం జరిగింది. పరి

శోధన అనే సాత్త్వికాహంకారం అలా దూరంగా ఉంచి చెబితే ఈ పతనంవల్ల నాలోని కొన్ని భావలోకాలు విచ్చుకోవడం, ఒక నిరంతర మాధురీ దర్శనానికి నేను గురికావడం నాకు తెలీకుండానే జరిగింది. ఆ తరువాత ఏ జల్పనం చేసినా, ఎప్పుడు కలంపట్టినా ఈ తత్త్వం తాలూకు విషయం ఒకటి చోటు చేసుకోవడం జరిగింది. అలా ఒక సందర్భంలో బయటకు దూసుకొని వచ్చింది ఈ క్రిష్ణలహరి.

**1980** లో సింహాచలంలో జరిగిన గురు పూజలో ఏదైనా కార్యక్రమం సమర్పించాలను కొన్నప్పుడు బాలకృష్ణుని లీలా విలాసాలను కొంత వచనంగా కొంత గేయంగా (సంగీతంతో) సమర్పిస్తే బావుంటుందని తోచి అలా చేయడం జరిగింది. గురుదేవులు విని ఇది గోష్ఠీరూపక పద్ధతికి చెందుతుందని, ఆమోద యోగ్యంగా ఉందని ఆశీర్వదించారు, ఆ ఉత్సాహం పురస్కరించుకొని దీన్ని అచ్చువేయించాను. భావరేఖలు స్పష్టంగా ఏర్పడని బాల్యయౌవ్వన సంధి వయస్సునుండి (Adolescence) నాకు గురువు, దైవము, క్రిష్ణతత్త్వ ప్రతీక అయిన గురుదేవులకు ఈ అయిదు భాగాల "కృష్ణలహరి" సమర్పించుకుంటున్నాను.

రెండవభాగం శృంగారక్రిష్ణ, అందులో స్వామిశృంగార లీలావిలాసాలు, రాధాక్రిష్ణ తత్త్వం ఉంటవి. మూడవభాగంలో క్షాత్రక్రిష్ణుని ధర్మ సంస్థాపనము, నాల్గవ భాగంలో దయాక్రిష్ణు ని భక్తానుగ్రహ గాధలు, అయిదవ భాగంలో గీతాక్రిష్ణుని ఔప దేశిక తత్త్వం ఉంటుంది. అన్ని భాగాలలో కధకుని కధా కధ నము మధ్య మధ్య గేయాలాపనము సామాన్యము. సాధ్యమై నంతలో పరమ గంభీరము, మధురము అయిన క్రిష్ణకధను అదే రీతిలో తెలుగు శ్రోతలకు పఠితలకు అందించడం ఈ నాకృషికి ధ్యేయం. స్వామి అనుగ్రహం ఎలా ఉన్నదో! సహృదయులు ఏమంటారో!

ఒంగోలు. ధారా రామనాధశాస్త్రి.

# ద్వితీయ ముద్రణ నివేదిక

**1982** మకర సంక్రాంతికి రూపొందిన "కృష్ణలహరి" మొదటిభాగం ఇన్నేళ్లకి ఈ రూపం దాల్చింది. మొదట బాల కృష్ణ మాత్రమే అచ్చయింది. ఇప్పుడు తక్కిన భాగాలు కూడా కలిసిన క్రిష్ణలహరి యిది. అప్పటి ఆలస్యానికి గాని ఇప్పటి త్వరకు గాని నేను కారణం అనుకోను.

ఈ ముద్రణకి వెయ్యిన్నూటపదార్లు సమర్పించిన సహృదయశేఖరులు మాన్యశ్రీ బొలిశెట్టి శ్రీహరిగుప్త గారికి సకుటుంబంగా సమస్త సన్మంగళాలనీ ఆశంసిస్తున్నాను.

శ్రమకోర్చి ముద్రణకి అనుకూలంగా శుద్ధప్రతిని వ్రాసి పెట్టిన మా తృతీయ పుత్రిక చి.సౌ. శ్రీవల్లిశాయికి సకుటుంబంగా సమస్త సన్మంగళానిభవంతు.

ముఖచిత్రం కూర్చిన విశ్వవిఖ్యాత చిత్రకళాకులపతి శ్రీ గంగాధర్ గారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

ముద్రాపకులు భారత్ ప్రింటర్స్ వారికీ ముఖపత్ర ముద్రాపకులు దాంబే స్క్రీన్స్, ఒంగోలు వారికీ నా సాధువాదములు.

ఇ. కె. నివాస్<br>
విభవ<br>
మహాశివరాత్రి

ధారా. రామనాథశాస్త్రి.

# బాలకృష్ణ

## పరిచయం

బోసినవ్వుల చిన్నారి శిశువుగా, వెన్నదొంగగా, వేణుగానలోలునిగా బాలకృష్ణుడు, లోకమోహనుడు చిన్ననాట చేసిన ప్రతిలీలకీ అర్థం, పరమార్థం మేళవించి, లీలామాధుర్యం రంగరించి భావికాలపు జగద్గురుత్వానికి బీజాలు వేశాడు. పూతనాది యాతుధాన సంహారణ పటుత్వంలో దుష్ట శిక్షణాప్రవణత్వాన్ని నిరూపించాడు. మైత్రీభావ సౌరమ్యాన్ని నిరూపిస్తూ గోపబాలకుల నడుమ క్రీడామూర్తిగా నడయాడాడు. పూర్వజన్మ సంస్కారాలతో పుట్టిన గోపికలను వేణుగానంతో ఆకర్షించి నవనీత చోరత్వంతో నవ్వించి, రాసక్రీడలతో రంజించి, వస్త్రాపహరణంతో శరణాగతి నేర్పి అంచెలంచెలుగా ముక్తిపదసోపానాలు ఎక్కించాడు. నందయశోదల యింట క్రీడాబాలకుడై

## 2

వర్తించి, నర్తించి వారిజనేత్రలు ధన్యం చేశాడు. గిరియజ్ఞ స
ప్రదాయం నెలకొల్పి గో, బ్రాహ్మణ, దీనానాథ సేవ జీవిత ప
మావధి అని నిరూపించాడు, స్వామ్యంతో నిమిత్తంలేని సం
ద్వినియోగానికి వ్రజం ప్రతీకగా చేశాడు. ఇన్నిపనులు ఇని
రీతుల చేసి అందరికీ కంటి వెలుగై ఇంటి దీపమై ఓనా
అక్రూరునితో బాటు రథమెక్కి మధురకు తరలి వెళ్ళాడు.

ఇదుగో ఆ యీ కథల నాయకుడే బాలకృష్ణుడు.



బాలాయ నీలవపుషే నవకింకిణీక
జాలాభిరామ జఘనాయ దిగంబరాయ
శార్దూల దివ్యనఖ భూషణ భూషితాయ
నందాత్మజాయ నవనీతముషే నమస్తే.

ద్వాపరమున భూపాలుర చర్యలు
భూమాతకు హృదయమ్మున వ్రయ్యలు
మకుటధారులౌ మానవనేతలె
మాన గౌరవము మంట గలియగా
పాపకార్యముల భ్రష్టధర్ములై
క్రూర కర్మముల ఘోరమార్గముల
ఇలాతలము పంకిలము చేయగా

# 3

పుడమి తల్లికన్నీరు కడలియై
నిలువలేక గోమాతరూపమున
కమలగర్భు గాంచంగ నేగినది.

ఆమెతోబాటు దేవ బృందము బయలుదేరింది. వారంతా బ్రహ్మదేవుని దగ్గరకు చేరి ఇలా స్తుతించారు.

వేదమూర్తీ వందనం
నాదకీర్తీ అభినందనం
ఛందోబృంద సమాహితచిత్తా
సుందర వాణీ నందితహృదయా	వేద

నాదమ్ముల లోకాలను చేసి
వేదమ్ముల లోకేశులనిలిపి
యుగయుగాల ధర్మాను గుణమ్ముగ
జగజగాల కథ తీర్చిదిద్దెదవు	వేద

కపటులు మొరటులు కరుణారహితులు
పాపశీల భూపాలలోకము
దుర్మదులై దుర్మార్గము నలుపగ
ధర్మము చెడినది స్వామీ నాకర్మకాలినది స్వామీ	వేద

వేదధర్మ కర్మాచరణమ్మున
దేవవిప్ర సేవాచరణమ్మున

పేరుగన్నమా బ్రహ్మావర్తము
పాడుపడినదో స్వామి. బీడైపోయెను స్వామి   వేద

పుడమితల్లి కడుబడలిపోయినది
బడబానల జ్వాలావళి తెరలెను
కడలినీరు పెనుసుడులై యెగసెను
పుడమికింక మనుగడయే ముగియును   వేద

పరమేష్ఠి హృదయం ద్రవించింది. దేవముని బృందాన్ని భూమాతను వెంట తీసికొని క్షీరసాగర తీరంచేరాడు. అందరు శేషశాయిని స్తుతించారు.

స్వామి కన్నులు తెరిచాడు. కోటి పున్నముల వెన్నెల విరిసింది, ఆయన నల్లని మైఛాయ నుండి సన్నని వెలుగువెల్లువ మబ్బు తునకగా మారి బ్రహ్మదేవుని కనుబొమల నడుమగూడు కట్టింది. ఇంతలో ఆదిశేషుని శరీరంనుండి తెలతెల్లని పొలుసులు పాలకడలి తెల్లని నురుగులలో కలిసి అమ్ముకుట్టూ పరద గుడి లాగ చేరింది. సృష్టికర్త ఎనిమిది నేత్రాలకు స్వామి పాదసేవ చేస్తున్న లక్ష్మీదేవి ఎనిమిది ఆకారాలుగా కనిపించి ఆయన వాక్కులు మొదట అంతరిక్షంలో ఋక్కులుగా పలిశాయి. (వేదమంత్రాలు) అవే నారద మహర్షి మహతీ నాదంలో సప్తస్వరాలుగా వినిపిస్తున్నవి వీణారుతులే జగత్కథలుగా ప్రవర్తిల్లుతున్నవి. (సంగీతం)

# 5

మధురలో కల్యాణదంపతులైన దేవకీవసుదేవులు కంసుడు నడుపుతున్న రథంమీద ప్రయాణం చేస్తున్నారు. నల్లని మబ్బులను, తెల్లని మెరుపులను దూసికొని వచ్చిన గగన వాణి ఇలా అన్నది. "ఒళ్ళుమఱచి చెల్లెల్ని లాలిస్తున్నావు. ఆమె అష్టమ గర్భమే నీకు మృత్యువు" అంతే. అగ్ని జ్వాలలాగ ఆకాశానికి ఎగిసిన కంసుని కత్తి దేవకి కుత్తుకపై నిలిచింది. వసుదేవుడు కంసుని బ్రతిమాలి బామాలి తనసంతానాన్ని వరుసగా కంసుని కర్పించడానికి అంగీకరించి ఇల్లాలిముప్పు తప్పించాడు. తొలి సంతానాన్ని కంసునికి నిర్మమంగా నివేదించాడు. కంసుని కఱకు గుండెసైతం కరగి పోయింది. పసివాలుని చంపలేదు. ఎనిమిదవ చూలుదాకా దేవకి జోలికి రానని వాగ్దానం చేశాడు. కాలం గడుస్తున్నది, ఇలా ఏళ్లూపూళ్లూ గడిస్తే రాజెవరో రంగ ప్పెవరో! కథరక్తి కట్టేనా కంచికి చేరేనా? అటు కయ్యాలు పెట్టి కథ రక్తికట్టించడానికి, ఇటు నారాయణ తత్త్వం రోక్లా రోకళ్లా పాడించడానికి సమర్థుడైన నారదమహర్షి మహతి కంసుని మోసాలలో మూర్మరించింది.

కనుదెరువుము కంసరాజ
వినుమీ జడదారి బోధ
కడలివంటి మమతలోన
పడిమునుగకు బేలవోలె                    కను

చెల్లెలెవరు! బావెవ్వరు
తెరకావల ఎవరికెవరు?
సురలే పెను మాయజేసి
అరుదెంచిరి నిను దునుమగ　　కను

నందవ్రజము బంధువ్రజము
బృందారక బృందమయ్యె
శూరసేన మాధురములు
సురవిహారణ రంగమ్ములు　　కను

గత సంస్కృతి కాలనేమి
స్మృతి నిను వీడంగరాదు
సురజగతికి గురిపెట్టిన
కరవాలము దింపరాదు　　కను

దేవకి గర్భమ్మునందు
దేవదేవుడవతరించి
అన్యాయమునణచి ఆర్త
సంరక్షణ సలుపునంట　　కను

ఏ మాయన హరి లీలలు
బాలాకృతి నందగలవో
సందేహము తేలనయ్యె
చంపుము శిశుబృందమెల్ల　　కను

7

నారదుని ఉపదేశంతో కంసుని జన్మ జన్మాంతర సంస్కారాలు తేనెపుట్టలాగ కదిలాయి. పరమరాక్షసవిజృంభణం ప్రదర్శించాడు.

ఇప్పుడు దేవకీవసుదేవులూ, ఉగ్రసేనుడూ వేరు వేరు చెఱసాలల్లో బందీలు. తన గర్భవాసాన జన్మించిన ఆరుగురు పుత్రులూ కంసుని కత్తికి బలికాగా దేవకి గర్భశోకం దుర్భరమైంది. కంసుని విజృంభణకు మాధురశూరసేనాలు మలమల మాడి పోతున్నవి. బ్రహ్మణ్యులు, రాజభక్తులు, ధార్మికులు యథాయథలై వెళ్లిపోయారు. అంతరిక్ష దేవతల హాహాకారాలు గాలిలో తేలిపోతుండగా వేల్పులు గగనంలో వెయ్యి పడగల వెల్లగొడుగు పట్టారు. ఆ తేజస్సుని దేవకి కడుపున ఏడవపంటగా కాలపురుషుడు నారుపోశాడు. కాలం గడుస్తున్నది,

ఆనాడు యోగమాయను పిలిచి స్వామి యిలా సెలవిచ్చారు. ఓ యోగమాయా! నీవు నాదానవు. నా కథలకు హద్దులు పెడుతూ సృష్టిచిత్రాలకు రంగులుపూసే నీవు ఒకహిత కార్యం చేయాలి. ఇప్పుడు దేవకికడుపుపంటనావెలుగులో సగపాలు. నాసన్నిధిలో నాకు మిగులుగా, నా పరోక్షంలో నానీడగా మసలే శేషతత్త్వం. మందలో నందుని అండన కాలం వెళ్ళదీస్తు

న్న రోహిణి మహాయోగిని. ఆమె గర్భంలోనా యీ శేషయోగ తేజస్సును ప్రవేశపెట్టు. నేను తరువాత పూర్ణ యోగమూర్తిగా దేవకి గర్భాన్ని ప్రవేశిస్తాను నందగేహిని యశోద మహానంద స్వరూప. నీవామెకు పుత్రికవై జన్మించు. అటుపైన నీవు సర్వలోకారాధ్య వౌతావు... ఇలా అంటున్న స్వామి వాక్కు మేరకు కథా దృశ్యాలు కదలి పోతున్నాయి.

దేవకికి అష్టమగర్భ చిహ్నాలు పొడసూపి క్రమంగా వృద్ధి నందుతున్న వేళ- ఆ వార్త విని తీరని దిగులుతో ఆరని పగతో ఆలోచిస్తున్నాడు కంసుడు. దేవకి గర్భస్థుడైన స్వామి నుద్దేశించి ప్రార్థనలు చేస్తున్నారు దేవముని బృందం. స్వామి అవతరణవేళ దగ్గర పడుతున్నకొద్దీ చైతన్య విలసితమై సంతోష తరంగాలలో తేలియాడుతున్నది విశ్వంభరావలయము.



అండ పిండ బ్రహ్మాండ మంతటను
ఆనంద తాండవమే పరమానంద తాండవమే
గుండె గుండెలో గుబులు కొన్నదీ
ఆనందలాస్యమే పరమానంద లాస్యమే          అండ

నీల నీల గగనాంచల సీమలు
నిగ నిగ మెరిసేనే
నింగి బాట కపురంపు ముగ్గులై
తారలు వెలిగేనే అంద

చల్లగాలి నును తాకున పుడమికి
ఉల్లము జల్లనియేనే
వెల్లువగా మిన్నిందిన కడలి
నురువుల విరిసేనే అంద

నదుల జలములకు నరులమనములకు
నాశెము హెచ్చేనే
ఊరు నాడూ మధుర భావములు
ఉరకలు వేసేనే అంద

గాలికి నవ్య సుగంధం
కెంధూళికి రంగుల అందం
చెట్టూ చేమా పుట్టా గుట్టా
కట్టు తెంచుకొని కొసరే అందం అంద

గ్రహతారకలూ గృహదేవతలూ
మహా మహిములై యున్నారే

భూత ధాత్రి బడలికలు తీరగా
నూతనావ తరణమ్ము జరుగులే　　　　　అంద

* * *

శ్రావణ బహుళాష్టమి. అర్ధరాత్రి. చెరసాల చీకటి కోణం అట్టడుగున తన గర్భమునుండి ఆవిర్భవించిన విశ్వ మోహన బాలుని దివ్య తేజస్సు దేవకిని ఆనంద డోలికలలో ఊపి వేసింది. మాతృసహజ వాత్సల్యం మరుక్షణంలో విషాదం గా మారిపోయింది. బాలుని హృదయానికి హత్తుకొని కన్నీరు మున్నీరైంది.

ఎన్ని జన్మల నోములో
ఫలియించి నిన్ను కన్నాను తండ్రీ
నిన్ను మాత్రము కంసుడూ
నాకెట్లు దక్కనిచ్చును నాయనా !
ఏడు మారులు వరుసగా నాతండ్రి
ఏడుపునె కంటిరన్నా
కడుపు పండిన గడియలే
దేవకికి కడుపు మండిన గడియలూ

లోకమున శోకమెల్లా
నాతండ్రి నాకె వ్రాసెను దేవుడూ
లోక మోహన బాలకా
నీవేల నాకు జన్మించితయ్యా !

దృశ్యం మారింది. దేవకికి, అల్లంత దూరాన ఆత్మాను సంధాన జ్ఞానమూర్తియైన వసుదేవునికీ కన్నులు మిఱుమిట్లు కొలుపుతూ వినీల జలధర దేహంతో చతుర్భుజ శంఖ చక్రాది దివ్య చిహ్నాలతో శ్రీమన్నారాయణుడు దర్శన మిచ్చి ఇలా అంటున్నాడు.

అమ్మరో దిగులు వీడూ నామాట
నమ్మికలో ఆలకించూ
జన్మ జన్మాల నుండీ నీ కడుపె
జన్మ రంగమ్మె నాకూ
ఎవ్వరని యెంచితమ్మా
యీ శిశువు నెట్లు లాలింతువమ్మా
ఎవ్వరేనియు నీవలె నన్నిట్లు
కనిపెంచగలరటమ్మా
పృశ్ని సుత పాఖ్యలైనా

దంపతులు పుణ్యాలు మూటగట్టి
పృశ్ని గర్భుని పేరిటా
నను మీరు పెంచి లాలించి నారూ
అదితి కశ్యప మూర్తులై
నను మీరు ఆరాధనమ్ము సలుపా
ఉదయించి వామనుడనై నేనపుడు
ఉద్ధరించితి వేల్పులా
దేవకీ వసుదేవులై యీ భవము
తీవ్ర సాధన సలుపగా
దేవకార్యము తీర్పగా నేనిట్లు
దిగివచ్చినాను తల్లీ
మూడు జన్మల బంధమే నా తల్లి
ముక్తిపద సోపానమే
మూడు వేదాల వెలుగూ
నీ ముద్దుమురిపాల బిడ్డడాయె
పాపడని లాలింతువో నాతల్లి
దేవుడని పూజింతువో
ఆపజాలని ఆర్తితో
దుఃఖాన అలమటించేవొ తల్లి

అంటూనే ఆవిశ్వవిరాణ్మూర్తి నీల బాలమూర్తిగా మారింది. క్షణంలో దివ్యదర్శనస్మృతిని కోల్పోయిన దేవకి మాతృసహజవాత్సల్యంతో కుమారుని ఇలా లాలిస్తున్నది.

ఎల్లలోకాలనేలే స్వామి
నాపొత్తిళ్ల పాపడైతీ
ఎల్ల కాలము నిట్టులే
నాయింట ఆడి పాడంగ వలయూ
లాలపోసేను తండ్రీ నీకిపుడు
పాలు పోసేను తండ్రీ
పరులు దువ్వేను తండ్రీ నీనుదుట
తిలకమలదేను తండ్రీ
రార దేవకి నందనా రావయ్య
వసుదేవరాజ తనయా
రార నాకన్న తండ్రీ నాకంటి
వెలుగ నా చెంత చేరా.

ఇలా కట్టలు తెంచుకున్న వాత్సల్య సాగరానికి కట్ట వేస్తూ బాలుడు ఇలా అంటున్నాడు.

మామ కంసుడు వచ్చెనా
మన కింక మర్యాద దక్కదమ్మా
మామ యిటు రాక మునుపే నను మీరు
మాయమ్ము చేయవలెనూ
నందరాణ్మందిరమునా
నన్నునిచి యోగమాయను తెండిటా
నంద నందన ఖ్యాతితో నేనందు
నర్తించి వర్తించెదా
కంసు కరవాలమునకూ కన్యకను
ఎరవేయవలెను మీరూ
కావితా భద్రమూర్తి ఆకన్య
లోకాల నేల గలదూ
చన్గుడిపి లాలి జోలీ లాలించి
పెంచి మురిపాలతేలీ
నన్గాంచు భాగ్యగరిమా ఆనంద
గేహినికె దక్కునమ్మా
ఎన్నటికో వత్తునమ్మా నాతల్లి
దేవకి వందనమ్మా

894.8131 RAD

Acc. No. 7848

నన్ను మరువకు మమ్మురో కర్తవ్యశ్రీ
మెన్నడే మరకు తల్లీ ....

కర్తవ్యం తెలిసిన వసుదేవుడు పొత్తిళ్ళ శిశువును తీసి కొన్నాడు. అప్పటికే స్వామి మాయజాలంచేత దేవకి కన్నులతో పాటు సృష్టి యావత్తు నిద్రా ముద్రితమైనది. కారాగార కవాటాలు తెరుచుకున్నవి. ఆకాశంలో మినుకు మినుకు మంటున్న తారకలు వసుదేవునికి దారి చూపాయి. బాలుని అరుణ చరణాలు హద్దు పెడుతుండగా చల్లగాలికి సేద తీర్చుకుంటున్న యమున వసుదేవునికి త్రోవ నిచ్చింది. నందుని మందలో యశోద ప్రక్కలో బాలునుంచి బాలికను భద్రంగా మధురకు చేర్చాడు వసుదేవుడు.

ప్రసూతి వార్త విన్న కంసుడు కత్తి ఝళిపిస్తూ కారాగారానికి వచ్చాడు. దేవకి అన్నగారికి అంజలించింది పుట్టింది ఆడపిల్లనీ, ఆ పసికందును కాపాడమని ప్రార్థించింది. కంసుని మది కరగలేదు. అతని కరవాల ధారకు వ్రీలి గగనానికి ఎగసిన యోగమాయ దివ్యాలంకార శోభితయై సిద్ధ సాధ్యగంధర్వ సురకిన్నర కింపురుష గరుడోరగాది సమస్త దివ్యజన సుంస్తు

త్యమై పూజలందే శైల పుత్రికగా దర్శన మిచ్చి కంసునితో గంభీ రంగా "హింసాత్మకుడవై దేవకి సంతానాన్ని పొట్టన పెట్టు కున్నావు. నీ కథ ముగియబోతున్నది నాతో పుట్టిన మహావీరు డొకడు తగిన తావున పెరుగుతున్నాడు. అతడే నీ పాలిట మృత్యువు" అంటూ అదృశ్యమైనది. కంసుడు కుప్పగూలి పోయాడు. తెప్పరిల్లుకొని ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చి దేవకీ వసుదేవులను బంధవిముక్తులను చేశాడు. పశ్చాత్తాపం ప్రదర్శించాడు. కాని మనసులో ఆరాటం అణగలేదు. మంత్రి సామంతాదులతో సంప్రదించాడు. వారంతా సమీకృత పరా క్రములై విజృంభించి కంసుని ఆదేశం మేరకుసాధు బ్రహ్మణ్య బాధ, శిశుహింస మొదలైన అమానుషకృత్యాలకు తలపడ్డారు - మాధుర శూరసేనాలు మళ్ళీ ఒక్కసారి దారుణ మారణ హింసా కాండలో మలమల మాడిపోతున్నవి.

అక్కడ నందవ్రజంలో పెరుగుతున్న బాలకృష్ణ లీలా విభూతి దేవముని బృందగేయమై యిలా మురుమ్మరిస్తున్నది.

జయ జయ శ్యామల కోమల రూపా
నంద గేహ దీపా

జయ సంసార పయోనిధి తరణా
సర్వపాప హరణా ముక్తి సమాచరణా.

బాల ఘాతినీ రక్కసి పూతన
పాల నీయు మిష విషమునీయగా
పాలతో బాటుగ పంచప్రాణముల
పీల్చి కూల్చి స్వర్లోకమంపితివి జయ

శకటాసురునీ తృణావర్తునీ
వత్సాసుర బక ధేనుకాదులగు
యాతుధాన సంహరణ చణుడవై
రూపుమాపి లోకాల గాచితివి జయ

కాళియోరగు ఫణముల పైనా
కమనీయారుణ చరణములూనీ
లీలా తాండవ కేళి సల్పితివి
హేలగ విషధరు గర్వమడంచితి జయ

పొంచి పొంచి తరివేచి గోపికల
వలువలెల్ల నిపుణముగ దోచితివి
శరణమనుచు చేయెత్తి మ్రొక్కిన
శరణమొసగి ప్రణయమున నేలితివి జ

గిరి సరిదంబర క్షేత్రార్థంబుల
గో బ్రాహ్మణుల్లను దీనానాథుల
సేవించుచు జీవించు టొక్కటే
యాగ యోగ సంయోగ మంటవి జయ

అణువణువున అహ్లాద తత్త్వము
అడుగడుగున అనంతలాస్యము
యమునా తీర విహార గాథలే
సమలంకృత తత్త్వార్థ బోధలు జయ

గోపాంగన జీవాత్మ రూపము
గోవిందుడు రసరంగ నాయకుడు
విశ్వరూప చైతన్య విలసనమె
శాశ్వత రసమయ కేళీ నటనము జయ

హింసాత్మకు కంసాధము చంపితి
ఉగ్రసేను రాజ్యమున నిలిపితివి
మంచి చేయునెడ మమతాహంతల
మించి చూడగల మహనీయుడవై జయ

పరమ ధర్మాత్ములై దుష్ట శిక్షణచేసి తల్లిదండ్రుల సల
చిన రామకృష్ణులు వేదోక్తంగా ఉపనీతులైనారు. బ్రహ్మచా

తై గురుసేవార్థము బయలు దేరి వెళుతున్న వేళ మధురానగర ప్రజయావత్తు గుమిగూడ ఇలా వీడ్కోలు చెప్పారు.

స్వామీ లోకాలనేలు స్వామీ
వేదాల వెలుగు స్వామీ... ...
జననీ జనకుల చెఱ విడిపించితి
హృదయానందము కలిగించితివీ
ఉపనీతుడవై వెలుగొందితివి
ధర్మమార్గవర్తీ
బ్రహ్మణ్య దేవకీర్తీ స్వామీ
జగద్గురుడవై మనగల వాడవు
గురుసేవకునై అరుగుచుంటివి
గురుసేవారతి జగతికి గరపగ
శుద్ధ భావవర్తీ
సంబుద్ధ యోగమూర్తీ స్వామీ



# శృంగార కృష్ణ

## పరిచయం :-

రాముడి పేరు చెప్పగానే కఠోరమైన ఏకపత్నీవ్రతము, కృష్ణుడు అనగానే పదహారు వేల నూట ఎనిమిది మంది శృంగారనాయికలు అందరి హృదయాలలో స్ఫురిస్తారు. స్ఫురించడమే కాదు. ఆయన శృంగారకథలు జనం నోళ్లలో పడి రకరకాల రూపాలు పలువిధాల భావాలూ సంతరించుకొన్నాయి. ఎక్కడైనా శృంగారం పెచ్చుమీరితే రాసలీల అంటాం, ఎవడైనా గొప్ప భోగిని గూర్చి చెప్పాలంటే అమ్మో! వాడు కృష్ణ భగవానుడు అంటాం. పాపం దేవుడు కదా! ఏమైనా అంటే కళ్లు పోతాయేమోనని భయంగాని సగటుమనిషికి కృష్ణుడి శృంగారకథ ఓ మితిమీరిన సరసమనే అనిపిస్తుంది. దానికి తగ్గట్టుగా ఆ కథని పుచ్చుకొని సంప్రదాయం తెలీని కవులూ, ఆర్ష విజ్ఞానాన్ని అర్థం చేసుకోలేని 'ఆధునికులూ' వీళ్ల ఊహాల్ని పెడత్రోవ పట్టించిన పాశ్చాత్యులూ ఇలా ఎందరో కృష్ణదేవుని

శృంగార కథకి వ్యాఖ్యాతలు చెప్పారు. చెబుతున్నారు. మనం వింటుంటే చెబుతూనే ఉంటారు. కొంచెం నిదానించి ఈకథల్లో రహస్యాలు ఏమైనా ఉన్నాయా? విచ్చలవిడి శృంగారం చెప్ప డానికి ఓ వ్యాసులూ, ఓ పోతనా కావాలా? అని ప్రశ్నించు కుంటే అనుమానాలన్నీ తొలగిపోయి ఓ మాధుర్య దర్శనం, ఒక విజ్ఞానస్పర్శ, ఒక మహాపౌరాణిక వైదిక విద్యా సంకేతం మనకి భాసిస్తుంది. బహుపత్నీ రూప జీవాత్మరతి అంటేఏమిటో తెలుస్తుంది. ఇలా తెలిడానికి ఋషిపుంగవులూ, పూర్వకవులూ ఆయా సందర్భాలలో ప్రవచించిన వేదవిజ్ఞానం అనుసంధానం చేసికోవాలి. ఇతర అవతారాలన్నీ విడివిడిగా వేరువేరు అంశా లను ప్రతిపాదిస్తుండగా సంపూర్ణమై సాక్షాత్తు భగవంతుని విశ్వ విరాట్స్వరూపంగా క్రిష్ణావతారం భాసిస్తుంది. అందుకేఅన్నా రు. "అంశావతారా అన్యేతు క్రిష్ణస్తు భగవాన్ స్వయమ్" అని. భగవంతుని విశ్వ విరాటస్వరూపం, బల వీర వైభవాది షడ్గుణాలూ సమస్త వైభవము సృష్టిస్థితిలయలూ అన్నీ ఒక్క మూసలో పోసి చూపినట్లుగా క్రిష్ణుడు చూపిస్తాడు. అంచేత ఆయన ఆటపాటలకి, చదువుసాములకి, పెళ్లి పేరంటాలకి, ఆవేశ కావేషాలకి, ధర్మాధర్మాలకి, అన్నిటికి ఓ అర్ధం పరమా

ర్ధం ఉన్నవి. అది తెలీకపోతే మన బ్రతుకు వ్యర్థం చూడండి
ఆయనకి భార్యలు మొదట ఎనిమిది మంది. రుక్మిణి, జాంబవతి
సత్యభామ, కాళింది, మిత్రవింద, నీల,(నాగ్నజితి) భద్ర,లక్షణ
ఈ పేర్లవరుసలోను వీళ్లని స్వామిపెళ్లాడిన పద్ధతుల్లోను కొంచెం
తేడాలున్నా మొత్తం మీద అష్ట మహిషులున్నారనేది అక్షర
సత్యం. నాగ్నజిత్తు వివాహం హరివంశంలో నీలా వివాహంగా
వర్ణించారు. భగవద్గీతలో స్వామి అన్నాడు "భూమి రాపోనలో
వాయుఃఖం మనో బుద్ధి రేవచ అహంకార ఇతీయం మే భిన్నా
ప్రకృతి రష్టధా" భూమి, నీరు, నిప్పు, గాలి, ఆకాశము, మన
స్సు, బుద్ధి, అహంకారము—ఇవి పిండాడ సమవాయి కారణా
లయిన ప్రకృతిశక్తులు. వీటి స్వరూపాలతే రూపకల్పన చేసి
అయన సాక్షాత్తూ భగవంతుడు కాబట్టి వీరితో ఎల్లప్పుడూ క్రీడి
స్తాడని చెప్పడానికి ఇలా వ్యక్తులుగా, రాజకుమార్తెలుగా,
మేనత్త కూతుళ్లుగా, నదీ స్వరూపాలుగా కథలు కట్టి ఆయా
ఎనిమిది మందినీ స్వామి వివాహం చేసుకున్నాడు అని పెద్దలు
చెప్పారు.ఇక ఈ ఎనిమిది ప్రకృతులను నడిపించే పరాప్రకృ
తి ఒకటి ఉన్నది. అది గోలోకంలో ఉంటుంది. గోలోకమంటే
సృష్టిస్థితి ప్రళయాలకి రంగస్థలమైన అంతరంగిక కాంతిలోకం.

4

చైతన్యకేంద్రం. ఆ పరాప్రకృతి ఏం చేస్తుందంటే యీ ఎని మిది ప్రకృతుల విలాసాలనీ అదుపులో ఉంచుకొని స్వామి యొక్క అంతర్యామి లక్షణంగా వ్యవహరిస్తూ వారి మార్గాలనీ, సాధననీ పవిత్రం చేసి స్వామిలో ఐక్యం అయ్యేలా చేస్తుంది. ఆ శక్తి పేరే రాధ. ఈ పరాప్రకృతి జీవభూతమైన తన అంతర్యామి తత్త్వమని స్వామి భగవద్గీతలో చెప్పుకున్నాడు.

"అపరేయ మితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరామ్
జీవ భూతం మహాబాహో యయేదం ధార్యతే జగత్" ఈ పరా ప్రకృతే రాధ. రాధకథ విచిత్రంగా ఉంటుంది. ఆమె క్రిష్ణునికి మేనత్త అనీ, చిన్నతనం నుండి చనువుగా పెంచి పెళ్లాడిందనీ ఇలా ఎవేవో చెబుతారు. అలా ఆమె కథకి రూపరేఖలు మారడానికి పురాణాలలోచెప్పిన కొన్ని కథలూ గాథలూ కారణం. ఆ కథలు పెద్దలుద్దేశించిన తీరువేరు. మనకిప్పుడు అర్థమవుతున్నతీరు వేరు. ఓసారి గోలోకంలో స్వామి 'విరజ' అనే నాయికతో విహరిస్తూ శ్రీదాముడనే చెలికాణ్ణి ద్వారం దగ్గర కాపలా ఉంచాట్ట. రాధ స్వామివార్ని వెదుక్కుంటూ వచ్చి అసలు సంగతి గమనించి లోపలకి వెళ్లబోతుంటే శ్రీదాముడు

అటకాయించాట్ట. రాధకి బాగా కోపం వచ్చి శ్రీదాముణ్ణి భూలోకంలో పుట్టమని శపించిందట. వాడికీ తిక్కరేగి రాధకూడా భూలోకంలోనే పుట్టి స్వామిని ఎడబాసి కళంకినిగా జీవించి చివరికెప్పుడో యుగాంతానికి స్వామిలో ఐక్యం చెందేలాగ శపించాడట. రాధ విరజని భూలోకంలో నదిగా పుట్టమన్న దట. ఇదిగో యీ ఆధారం చొప్పున రాధమ్మకథ ముళ్ళపొద లాగే పెరిగింది. అసలేమిటంటే రాధ ఆరాధనా భావం. విరజ నిరహంకారము, రజోగుణానికి అతీతమూ అయిన శుద్ధసత్త్వం కట్టుకథల్ని తీసేస్తే వీరి కలయిక సాక్షాత్తూ పరమాత్మ సాక్షాత్కారం.

ఇక చిన్నతనంలో స్వామికి సుగంధలేపనాలను సమర్పించి ఆయన స్పర్శ వలన కురూపాన్ని వదలి సురూపాన్ని పొంది ఆయన పొందుకోరి ఇంటికి పిలిపించుకొని మరీ ధన్యత్వాన్ని పొందిన మరో నాయిక కుబ్జ. అంటే పొట్టిపిల్ల. ఆమెకే త్రివక్ర అని పేరు. అంటే మూడు వంకరలు కలది అనిఅర్థం అంతాబాగుంది కాని అప్పటికి కృష్ణుని వయస్సెంత? ఆయనతో సంగమం కోరడం ఏస్త్రీకైనా సహజమా. సహజము కాదు కనుకనే ఆమె కుబ్జ అయింది. మనస్సూ కుబ్జమే, దేహమూకుబ్జమే.

ఇదో వింతకథ. స్వామికి రెండు దేహాలున్నాయి. ఒకటి ప్రాకృతము. రెండవది ప్రకృతికతీతము. అందులో స్వామిపై కోరికకలవారికి ఆయన ప్రకృతికతీతమైన స్పర్శనే యిచ్చాడట. వాళ్లు మాత్రం ప్రాకృత స్పర్శనే పొందారు. దాని వలన వాళ్లకి కుబ్జత్వం(దైహిక మానసిక ఇంద్రియాది శక్తులు ముడుచుకొని పోయి ఉండటం) తొలగిపోయింది. స్వామియొక్క ప్రాకృత శరీరానికి మాత్రం అన్యస్పర్శ పొందకుండా తప్పింది. అంటే సమస్త దేహధారులలో ఆయన అంతర్యామిగా అప్రాకృతుడు, దేహమయమూర్తిగా ప్రాకృతుడు. జీవుడుగ బద్ధుడు అంతర్యామిగ అతీతుడు- ఇదుగో ఇలా యీ అర్థంలో ఆ కుబ్జ కుబ్జత్వం తొలగి హృదయాబ్జం వికసించి స్వామి అంతర్యామిత్వానికి విహార రంగమైంది. త్రివక్ర కాస్తా స్వామి అప్రాకృత స్పర్శచేత త్రిపథ అయింది. త్రిపథ అంటే గంగ. ఎవరి వల్ల ఆమె నిండు యౌవనాన్ని, అందాన్ని, పొందిందో ఆ అందాన్ని, యౌవనాన్ని స్వామికే అర్పించుకొన్నట్లు తృప్తిపడి ధన్యురాలైన మహా యోగిని కుబ్జ —

ఇక నూరుగురు ఎవరో చూద్దాం. ఏ పురాణంలోనూ స్వామి నూర్గురు స్త్రీలని పెళ్లి చేసికొన్నట్లుగాని. వాళ్ళు ఫలానా

దేశాల రాజ పుత్రికలనిగానీ వివరాలు చెప్పలేదు. కాదాఅంతే సంపూర్ణంగా గృహస్థ ధర్మాన్ని ఆయన స్వీకరించాక మొత్తం పదహారువేల నూట ఎనిమిది మంది స్త్రీలలో ఆత్మారాముడై రమించాడని చెప్పారు. పదహారువేలమంది కంటే ముందు నూ తుగుర్ని గురించి ఆలోచిద్దాం. నూరు అంటే సంఖ్యావైదిక సం ప్రదాయంలో ఆనందాలకి (శతానందములు అంటామే అవి) ఆయుః ప్రమాణాలకి సంకేతం "శతమానం భవతి శతాయుః పురుషః శతేంద్రియః " స్వామి పొందిన శతానందానుభవ సం కేతాలు. ఇక షోడశ సహస్రాంగనలు మిగిలి ఉన్నాయి. పద హారువేలు అన్న సంఖ్యలో పదహారు అనేది సృష్టి క్రీడలోని షోడశప్రకృతులను తెలుపుతుంది. అవే అయిదు జ్ఞానేంద్రియా లు, అయిదు కర్మేంద్రియాలు, అయిదు తన్మాత్రలు, మనస్సు వీనిచేత పరివృతుడై జీవుల్ని నాయికలుగా చేసికొని అంతర్యా మి క్రీడిస్తుంటాడు. ఈ క్రీడకి పరికరాలుగా ఉన్న షోడశ ప్ర క్రుతుల విలాసము సహస్ర శబ్ద రహస్యం చేత వేదం సంకేతి స్తోంది. ఆ విచారణ యిలా ఉన్నది :

సహస్ర సంఖ్య పురుష సూక్తంలో చెప్పిన వేయితలల కి సంకేతము. శీర్యతే ఇతి శిరః - అన్న వాక్యాన్ని బట్టి పురు

షోత్తముని అంశ అయిన జీవలోకంలో క్షరపురుషుని ఉద్భవా న్ని శీర్షాలు అంటారు. అంటే పొటమరించేవి అని అర్థం. అం దులో ఒక్కొక్కప్పుడు సోహం అనే శ్వాసమంత్రంలోను, హంసో అనే నిశ్వాసమంత్రంలోను జీవిగా ఏర్పడి స-హ-స అనే మంత్రధ్వనులను అధిష్టించి జీవించడం జరుగుతుంది. దీని కి 'ర' అనే అగ్నిబీజం చేరిస్తే అది ప్రాణసూచకమై క్షరపురు షుని తాత్కాలిక స్థితి బీజమవుతుంది. దీనిలో శీర్షం కట్టుకుంటే అది సహస్రారం అవుతుంది. ఇలాగ ఉపాధిపురుషుడైన క్షర పురుషుడు పైన చెప్పుకున్న షోడశప్రకృతులకు అంతఃపురం గా ఏర్పడతాడు. దీన్నే రచనా చాతుర్యం కోసం షోడశ సహ స్రాంగనలుగా సంకేతించారు. ఈ అర్థాన్ని వేయి అంచులుగల 'సుదర్శనము' కూడా సంకేతిస్తున్నది. మొత్తంమీద స్వామి యొక్క సర్వతోముఖ వైభవానికి, విశ్వవిరాట్ స్వరూపానికి యీ నాయికలు సంకేతాలుగా ప్రాచీన ఋషులు దర్శించారు.

అదీ స్వామి కల్యాణ శృంగార లీల—

వనమాలి కల్యాణ లీల

ఇది జగదేక శృంగారహేల

హృదయాల మధుధార లొలికించి పులకించి
కైవల్యమందించు కమనీయడోల    వన

అలనాటి శ్రీదేవి వైదర్భిగా
తొలినాటి భూదేవి శ్రీసత్యగా
తనమేన కొలువైన నీలగగనమ్ముగా
నిగమనవనీతాలు నినదించు నీలీల    వన

కుబ్జా హృదబ్జాన మధుపమ్ము రేడు
గోపాంగనాజీవ గోస్వామి వాడు
ఒకరాధ ఒకగోద తపము చేసినవేళ
ఎద నిలిచి కదలించు కరిగించు నీలీల    వన

ఇలలోని జనులెల్ల హృదిలోన భావించి
తనతోడ బ్రదుకంచు తపియించువేళ
శ్రీపాద రేణువుగా చిన్మయానందముగ
శిలకైన గిలిగింత కలిగించు నీలీల    వన



ఆయన కల్యాణ కథలు, శృంగార లీలలు చెప్పుకోవడం మొదలెడిదే అవి అనంత రససాగరం. ఎక్కడ మునిగినా

ఎక్కడ తేలినా అమృత రసప్రవాహమే. ఎక్కడో ఎందుకు మొదట తీర్థం కుండిన పట్టణం. అక్కడే ఆరంభిద్దాం అదుగో అదే కుండిన, భూమండనం. సర్వలక్షణలక్షితం. నీలాకాశంలోకి చొచ్చుకొని పోయే బంగారు మేడలు, మబ్బుల్లో తారాడే పతాకాలు, చాతుర్వర్ణ్యం వాడలు, నగరలక్ష్మికి పెట్టని సొమ్ములుగా ప్రకాశిస్తున్న విదర్భకుండినకు రాజధాని. కృష్ణదేవునికి ప్రథమ శృంగార రసరాజధాని, ఆరాజ్యం ఏలిక భీష్మకుడు ధైర్య గాంభీర్య, ఔదార్యాల్లో సముద్రుని పోలిక. పాల సముద్రంలో లక్ష్మి ప్రభవించిన పైనాన ఆ యింటిలో చిదిమి దీపం పెట్టదగిన చిన్నారి బాలిక రుక్మిణి లక్ష్మి పోలిక పెరిగి పెద్దదవుతున్నది. రుక్మి, రుక్మిరధుడు. రుక్మబాహుడు, రుక్మకేశి, రుక్మమాలి అనే ఆయదుగురు అన్నలకి అల్లారు ముద్దు చెల్లెలు. ఏ జన్మాంతర సంస్కారమో గాని చిన్ననాట నుండి ఆనోట యీ నోట బాలగోపాలుని కథలూ గాథలూ చెవులు రిక్కించుకొని వినేది. బొమ్మల పెళ్లిళ్ళ దగ్గర నుండీ. గుజ్జన గూళ్ల దగ్గరనుండి ఆమె ఆటలూ పాటలూ అన్నీ కన్నయ్య కథలతోనే నిండిపోయాయి. ఈ ఉద్యానవనంలో తన యీడు బాలికలను కలుపుకొని ఆడుతూ పాడుతూ.......

# 11

రారండమ్మా చెలులూ
రాకా చంద్రుని కళలూ
వీణల పాటలు వెన్నెలబాటలు
విరిసీ విరియని తోటలూ
ఆటల పాటల మేటులూ
సయ్యాటల సంద్రపు పోటులూ రా

మిథిలకు పోదామా సీతకు
పెండిలి చేదామా
శివుని కార్ముకము చిటికలో త్రుంచిన
శ్రీరాముని కథ విందామా రా

నందవ్రజమ్మున అందముచిందెడు
నల్లనయ్య కనుగొందామా
ఆలపాలనలో అలసిన సామికి
అలరులదండలు వేదామా రా

క్షీరసాగరం చిలికిన ఉరవడి
సిరికన్నియ సింగార మొలుకగా
మగసిరితో తన ఉరమున దాల్చిన
మాధవ దేవుని చూదామా రా

# 12

ఇలా ఆటల్లో పాటల్లో పెరిగి పెద్దదవుతున్నది. రాను రాను రుక్మిణి మనస్సు తనకి తెలీకుండా క్రిష్ణుని వశమవుతున్నది. యౌవనం పొడసూపిన కన్నె రుక్మిణికి ఉన్నట్టుండి ఓనాటు ఏదో తెలీని పులకింత. ఒక గిలిగింత కలిగింది.

ఎందుకీ పులకింత
ఎదలోని గిలిగింత
వెనుక జన్మలనుండి వెంటాడెనా ఇది
జన్మజన్మలకేని విడిపోవునా ఎందుకీ

చెలలనెల్లరకూడి కలలన్ని కలబోసి
ఆటాడు వేళల్లో అతడూ
పాల సంద్రపుటలల వరవల్ల ఉరవల్ల
తూగాడు తొలిరూపు దాల్చి
మెరిసి మురిసి మైమరచీ
కనుల వెలుగుగా దరిసేసే ఎందుకీ

పూజలందిన తల్లి భువనేశ్వరీదేవి
కనుల వెన్నెలగనిగ తోచి
నల్లమబ్బులలోన నా సామి కనుపించి
ఉల్లమెల్లా నిండి కల్లోలపరచేను

మెరసి మురిసి మైమరచీ
కనుల వెలుగుగా దరిసేనే    ఎందుకీ

గాలి యీలల వేణుగానాలు వినిపించి
కలువ రేకుల కనుల తళతళలు చిలికించి
నా పాటలో తాను నా మాటలో తాను
నేనె తానుగ నిలిచి నెనరూని పిలిచీ
మెరసి మురిసీ మైమరచీ
కనుల వెలుగుగా దరిసేనే    ఎందుకీ

అతడు నావాడనుచు అనిపించు హృదికి
అతడు లోకస్వామి అనిపించు మదికి
ఆతడెవరొ నేనెవరొ అసలు కథ యేమో
మాటకందని లీల మనసు పొందినవేళ
మెరసి మురిసి మైమరచీ
కనుల వెలుగుగా దరిసేనే    ఎందుకీ

తన సర్వస్వంలో కృష్ణుడే నిండిపోయాడు. ఆతనికే అర్పించుకోవాలి. ఆతన్నే పెళ్లాడాలి ... ఈ ఊహ రాగానే పూలతీగలాగ పులకించి నిలువెల్లా సిగ్గుమొగ్గ తొడిగిన రుక్మిణికి

అనిపించింది. ఇంతకీ ఎవరతను? ఎక్కడుంటాడు? నేనైతే అతన్ని ప్రేమించాను గాని అతను కనీసం నన్ను గురించి విన్నాడా? వినే ఎలా వింటాడు? ఆయన్ని గురించి నాన్నగారితో ఋషులూ, మునులూ, కథలూ, గాథలూ చెబుతుంటే నేను విన్నాను గాని ఆయనకి నా గురించి ఎవరు చెబుతారు? కనీవినీ ఎరుగని కన్నెను ఆయన ఎలా చేబడతాడు? ఇలా ప్రశ్నల తేనెతుట్టె రుక్మిణి మనస్సులో రొదచేస్తున్న వేళ మబ్బుచాటున మహతీనాదం అల్లంతసేపు ఆకాశంలో రవళించి అంతఃపురము లో అవతరించాడు నారదమహర్షి. కాళ్లు కడిగి నెత్తిన చల్లుకుని ఫలాహారం అందించి, వింజామరం వీచేంతలో ఆయనే అందుకున్నాడు—

మరల మరల తరుణీమణి రుక్మిణి
మనసు నింపి ధ్యానించు మాధవుని
జీవలోక సంజీవ భావునీ
దేవలోక సమ్మోహ దేహుని---
నందయశోదా నందకిశోరుడు
అందగాడు నవనీతచోరుడు
లీలామోహన కేళీభావన
లాలనగాన విలాసుడు మరల

## 15

గోపికలాతని హృదయ దీపికలు
గోవుల జీవుల కోటి భావములు
బృందావని ఆనందకందళము
మంద్రగాన మధు భావ తుందిలము మరల

వసుదేవ దేవకీ వరపుత్ర రత్నమ్మే
వసుధైక వీరుడు జగదేక మోహనుడు
యదువంశ దీపకుడు సదమల జీవనుడు
ధర్మ భావోద్భాసి ద్వారకాపుర వాసి మరల

కృష్ణదేవుని జాడ చెప్పిన నారదుని వాక్కు-జన్మజన్మాంతర సౌహృదాలను జ్ఞాపకం చేసే మంద్రంగా దేశకాలాతీత ప్రకృతి పురుష తత్త్వానికి ఉపదేశంగా భాసించి ఆ క్షణం నుండి ఇదీ అని చెప్పరాని మధురానుభూతికి లోనైంది రుక్మిణి. ఆ క్షణం నుండీ తాను తనకు తెలీకుండానే క్రిష్ణుణ్ణి చెట్టబట్టినట్టూ, సరస శృంగార కళ్యాణ విహారాలలో తేలిపోతున్నట్టూ, కౌగిలిలో కరుగుతున్నట్టు ఆనంద సీమలను అందుకున్నట్టూ.. ఇలలో ఉంటూ ఆ కలలోనే రుక్మిణి లీనమైయుండగా .... ఓ అపశ్రుతి అంతఃపురం ద్వారాలనుండి దూసుకొని వచ్చి వినిపించింది. ఆ దే తెలివిగల చెలుల మూలాన నాన్నగారు తన కళ్యాణాన్ని గురించి ఆలోచిస్తున్నవేళ, తన మనస్సునీ చుట్టున్న చుట్టపక్కాల

వాకునీ గమనించి కృష్ణదేవుడే తనకి తగిన భర్త అని నిర్ణయి స్తున్న వేళ అన్న రుక్మి సుడిగాలిలాగ దూసుకొని వచ్చి, కృ ష్ణుని గూర్చి నానాదుర్భాషలూ ఆడి తనకి చేది భూపాలుడు శిశుపాలుడే తగిన వాడని నిర్ణయించి, ఆ మేరకు భీష్మకుని ఒ ప్పించి శిశుపాలుణ్ణి అంగరంగవైభవంగా కళ్యాణానికి రప్పిం చే సన్నాహంలో ఉన్నాట్ట. పెళ్లిపిలుపులు కూడా వెళ్ళాయట కుప్పకూలిన రుక్మిణి కన్నీరు మున్నీరైంది. దిక్కూదరీ తోచ లేదు. స్వామికి తనను దక్కనీయ కుండా చేయడానికి ఈశిశు పాలుడెవరు? రుక్మికిలాంటి దుర్బుద్ధి పుట్టిందే? పెత్తనంలో నాన్నగారు తనకెంత యిష్టం లేకపోయినా రుక్మిమాట మన్నిం చక తప్పదు. వాడి బలం బలగం చలం సామంతం అలాంటివి ఏం చేయను? అని నిరాశా నిస్పృహలతో కొట్టుమిట్టాడుతున్న రుక్మిణి మనస్సులో అగ్నిద్యోతన గురుమూర్తులు మెదిలారు. ఆశతో రుక్మిణి కళ్లుమెరిశాయి. క్షణంలో సగంలో ఇష్టసఖి అగ్నిద్యోతనులను అంతఃపురానికి తీసికొనివచ్చింది. వృద్ధాప్యం చేత, నిరంతర విద్యా వ్యాసంగం చేత పండిపోయి వెలుగు ముద్దలాగా ఉన్నారు. అగ్నిద్యోతనులు సువర్ణ సవర్ణదేహయష్టి క విభూతి రేఖలతో వెలుగొందుతున్న విశాల ఫాలభాగం, తెల్ల

ని గుబురు కనుబొమల క్రింద విజ్ఞానపు వెలుగులను విరజిమ్ము తున్న విశాలనేత్రాలు, ఎన్నో యేళ్ల తపస్సు వల్ల అమృత మయమైన వచస్సు —అగ్నిద్యోతనులు "కల్యాణమస్తు" అని ఆశీర్వదించినంతలో రుక్మిణి వేడి కన్నీటి జాలు తన పాదాలు తడుపగా. తలెత్తి కన్నీళ్లు తుడుచుకొని రుక్మిణి తండ్రివంటి గురువుతో తన మనస్సు విప్పి చెప్పగా, తానూ కళ్లు తుడుచు కొని ముసలి బాపనయ్య "నీకేం దిగులు వద్దుతల్లీ! నేనున్నాను గా!" అంటూ ముసలితనం లెక్కచేయక పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వాగులూ వంకలూ దాటి, కోటలూ పేటలూ గడిచి ఊళ్లూ నాళ్లూ నడిచి, విలుకాడు లాగి విడిచిన బాణం లాగా క్రిష్ణదేవుని కాళ్లదగ్గర వ్రాలాడు. ఆ నల్లనయ్య యీయన కోసమే వేయి కళ్లతో ఎదురు చూస్తున్నట్లూ, ఏదో తియ్యని కబురు విన డానికి చెవులు రిక్కించుకొని ఉన్నట్లూ స్వాగతాంజలి ఘటించి స్వర్ణసింహాసనంపై కూర్చుండబెట్టి, కాళ్ళు కడిగి, పూజచేసి, వింజామరం వీస్తూ అడిగాడు అయ్యా! ఎవరు మీరు! ఈదాసుని వల్ల యేమి ఆశించి దయ చేశారు? ఆజ్ఞాపించండి అని. ఇంకేం అగ్నిద్యోతనుని హృదయం ఆనందలాస్యం చేసింది. ఆవేశం తో విన్నవిస్తున్నాడు......

నమో నమో యదువంశ శిఖామణి
ఛాత్రా కాళ ద్యుమణి
నమో నమో లోకశరణ్యా
నమో నమో వీరవరేణ్యా—
కుండిన వాడను తలపండినవాడను
రుక్మతల్లి కక్కరములు చెప్పుచు
నిగమాగమ నిఖిలార్థ సారమును
నిండుగుండెలో నిలిపినవాడను నమో

అగ్నిద్యోతన విప్రవరేణ్యుడు
అందించెడి వైదర్భివిన్నపము
అవధరింపవలె ఆదరింపవలె
ఆనంద శృంగార సందేశము నమో

ఆబాల్యము నిన్నారాధించెను
యౌవనమున నిన్నాకాంక్షించెను
నీవులేనిచే నిలువజాలనని
విన్నవించినది కన్నెరుక్మిణి నమో

వేదము నీవు నాదము తాను
ప్రకృతి పురుషుల బంధమిది

జన్మ జన్మలుగ సాగినదీ కథ
అందులకే కద తల్లికి వ్యథ	నమో

రావాలయా నీవు తరలీ
చతురంగ బలముల కదలీ
కావాలి కన్నయ్య కల్యాణం
అది లోకానికే వైభోగం	నమో

అక్కడ ఆ సందేశం అలా మ్రోగుతున్న వేళ ఇక్కడ విదర్భలో రుక్మిణి మనస్సు సుడిగాలిలో తీగలాగా ఊగుతున్నది. అసలే ముసలితనం. ఆపైన కాలినడక గురువుగారు చెప్పినైన వేసుకున్నారో! లేదో! నా మీద మక్కువ చేత, కృష్ణ దర్శన కుతూహలం చేత కొండలూ కోనలూ గడచి ఎప్పటికి చేరెను-- చేరితే సరా! ఆలోకస్వామి సమ్ముఖం ప్రసాదించి నా సందేశం విన్నాడో! లేదో. వింటే మాత్రం రాచకన్నె తెగించి వలపుకబురు పంపిందని తప్పుపట్టాడేమో! నా అదృష్టం ఎలా ఉన్నదో! అని తలపుల వలపుల మలపుల సుడిగుండంలో పడి కొట్టుకుంటున్నది రుక్మిణి....

సందేశాన్ని సాకల్యంగా విని కృష్ణుడు ఆనందంతో చిరునవ్వులు చిందించి అగ్నిద్యోతనునికి అఖండ సన్మానం చేసి అంజలించి అన్నాడు. "అయ్యా! మీ శిష్యురాలితో చెప్పండి.

నా కోసం ఆమె ఆమె కోసం నేనూ పుట్టామనీ ఎప్పుడూ పుడుతుంటామని. మీకు తెలియచేసుకుంది? ఇదిగో వస్తున్నాను, ముహూర్తం లోపలే విదర్భ చేరుతాను, ఎవరడ్డమైనా వైదర్భిని స్వీకరిస్తాను..... "అంటూ వీడ్కోలు ఇవ్వడం, మళ్ళీ లాగి వీడిన బాణం లాగ ఈసారి రథం మీద అగ్నిద్యోతనుడు అంతః పురంలో ప్రాలి రుక్మిణికి అన్ని సంగతులూ చెప్పడం, ఆమె కళ్లల్లో కల్యాణకాంతులు వెలగడం ఒక్కసారిగా జరిగాయి.

ఇంతలో నిద్రనుండి మేలుకున్నట్టు విదర్భ నగరం ఒళ్లు విరుచుకున్నది. రుక్మిణి కల్యాణ ఘడియ దగ్గరవుతున్నది. ఊరంతా తోరణాలూ, వాద్యఘోషలు, చలువపందిళ్లు,ముత్యాల ముగ్గులు. రత్నాల రంగవల్లికలు- పొలిమేరల్లో శిశుపాల దంతవక్త్ర జరాసంధుల డేరాలు. వారికి రుక్మి చేయిస్తున్న స్వాగత సన్మాన సన్నాహాలు- ఈ సంరంభం తమకి ఇష్టం లేకపోయినా 'పాపం రుక్మిణి! ఆతల్లికలా రాసిపెట్టి ఉంది కాబోలు' అనుకుంటూ తప్పనిసరిగా సన్నాహంలో భాగస్వాములైన విదర్భ ప్రజలు రాజభవనంలో ఉపనతవదనంతో బంధించిన వృద్ధ సింహంలాగ భీష్మకులూ- సమయం ఆసన్నమై రుక్మిణి సర్వాలంకారభూషితయై గౌరి పూజకు దేవాలయానికి వెళ్లి అమ్మవారి ముందు మోకరిల్లింది.

ముత్తైమంతా బొట్టు ముత్తైదుతనము
కలకాలమీయవే కల్యాణగౌరి
మగువల సొగసూ మగనాలి తనమూ
మనిచే తల్లివి నీవూ -- మమతల జల్లువు నీవు
శర్వాణీ అలివేణి శంకరురాణీ ముత్తై
నమ్మిన వారికి నాశము లేదని నమ్మితినమ్మా గారమ్మా
నను నా సామినీ నెనరున కలిపి మముదీవింపవె
మాయమ్మ
భక్తుల బ్రోచి ఆర్తులకాచీ మనిచే తల్లివి నీవూ
మమతల జల్లువు నీవు
శర్వాణి అలివేణి శంకరురాణీ ముత్తై
శివునిల్లాలిని చేరికొలిచితిని తొలిగింపవె భయతాపాలూ
ఇలపైన నెలకొన్న కైలాసగిరిలోల మాయిల్లు తీర్పవే
మాతల్లిగౌరీ
భక్తుల బ్రోచీ ఆర్తులగాచీ మనిచే తల్లివి నీవూ-
మమతలజల్లువునీవూ
శర్వాణి అలివేణి శంకరురాణీ ముత్తై

అమ్మవారిని ఆప్యాయంగా సేవించుకొని బయటకు వస్తున్నది రుక్మిణి.

పాలకడలి ప్రభవించిన సిరివలె
ఉదయగగనమున ఉషోరేఖవలె
అరుణ కమలమును కరమున దాలిచి మం
దిరము వెలువడెను మానిని రుక్మిణి
వీర మోహినిగ వీరులకగపడె
వారి గుండెల వ్వారి జల్లుమన
అపుడే రథమున అవతరించిన
సామికామెతగ సాగిపోయెనట
భువన వహన క్షమమైన కరమునను
రుక్మిణి రథమున నెక్కించుకొని
మెఱపు మెరిసి తెరమరుగానంతలో
స్వామి వేగముగ సాగె ద్వారకకు

రథం కదిలిపోతున్నది. ఊరిమేరలో ఓ కొండగట్టున నిలువబడిన అగ్నిద్యోతనులు రథం చూస్తూ కళ్లు తుడుచుకుంటూ వణుకుతున్న కంఠంతో

హాయిరావే తల్లి హాయిరావమ్మా
మహాలక్ష్మి వైదర్భి మా యింటి వెలుగా

శ్రీరస్తు శుభమస్తు కల్యాణమస్తు
సకల వాంఛిత భోగ సంసిద్ధిరస్తు
యదువంశ భూషణుని మదికెక్కి నానుచు
మది గర్వ పడబోకు మానినీ తిలకమా
పతి మాట రతనాల మూటగా భావించి
సేవించి జీవించి తరియింపవలెనమ్మ జోయి

దూరతీరాలలో ద్వారవతి సౌధాల
భోగ భాగ్యాల తులతూగు వేళనైన
చదువు చెప్పినవారి జన్మనిచ్చిన వారి
మదిలోన మరువకే మా చిట్టితల్లీ జోయి

క్షీరసాగర వీచి చిందులాడినరీతి
శ్రీపాద నటనాల సిరితాండవించి
గోపాల చేపుని ప్రేపల్లె వాడల్లె
కాపురము ఆనంద గోపురము కావలెను జోయి

తంత్రీవంటి గురుపు చిమ్మత్రద పట్టి ఆలపించిన ఆశీర్గీతం అల్లంత దూరానవేగంగా దూసుకుపోతున్న రథనేమి ధ్వానంలో గానంగా కలిసింది, కృతజ్ఞతతో కళ్లు చెమ్మగిల్లిన పక్తి

అగ్నిద్యోతనుని వాగాశీరక్షతలను శిరసు వంచి అందుకొని పులకించింది.

ఇంతలో — శిశుపాల దంతవక్త్ర జరాసంధాది దుష్ట రాజుల బలగంతో పుష్టినందుకున్న రుక్మి తన సైన్యాలను మోహరించి రుక్మిణీక్రిష్ణుల రధాన్ని నిరోధించి అగ్నిజ్వాలలాగ ఆక్రమించాడు. నేలానింగీ దద్దరిల్లేంత యుద్ధంలో క్రిష్ణమేఘం బాణాలవర్షంలో, బలరామ సర్పం ఆయుధ పూత్కారాలతో యాదవసైన్యం అట్టహాసంగా ఎదుర్కొన్నది. శత్రుదమనం, శత్రుత్వశమనం సాధించి బలరాముడు శాంతుడై తమ్ముని చూచి "మరదలు పిల్లను తీసికొని ఎకాయెకిన నువ్వు ద్వారకకు వెళ్లు శత్రుశేషాన్ని తుడిచిపెట్టి పెళ్లి విందు వేళకి ద్వారకకి చేరు తాను" అన్నాడు. క్రిష్ణరథం సాగిపోతోంది. రుక్మికిఇంకా పగ చల్లారక జవనాశ్వాలు పూన్చిన రథంలో క్రిష్ణునివెంబడించాడు స్వామి చక్రం ప్రయోగించడానికి సంసిద్ధుడవుతున్నవేళ కొత్త పెళ్లికూతురు రుక్మిణి క్రిష్ణుని దగ్గర మోకరిల్లి "మీసంగతి తెలీక మచ్చరిస్తున్నాడు అన్నయ్యని కాపాడి నాన్నగారికిపుత్రశోకం తప్పించండి" అని ప్రార్థించింది. వీర శృంగారమూర్తి క్రిష్ణుడు హాస్యమూర్తిగా మారి కత్తి వాదరతో రుక్మి తలమీద వెంట్రు

కలనీ మీసాలనూ ఒకవైపు తరగి చిరునవ్వుతో రథాన్ని ద్వారకకు చేర్చాడు.ద్వారకాపురం రుక్మిణీ కల్యాణవైభవంతో పొంగిపోయింది.........

శ్రీకృష్ణదేవుడు గృహస్థునిగా తొలి అనుభవంతో ఆనంద డోలికలలో ఊగులాడుతున్నాడు, ఇలాఉండగా సత్రాజిత్తు అనే రాజు సూర్యవరప్రసాదంచేత దివ్యమహిమాన్వితమైన శమంతక రత్నాన్ని పొంది హల్లు ఫెళ్ళుగా శ్రీకృష్ణుణ్ణి దర్శించడానికి రాజ సభకివచ్చాడు. అనర్ఘ రత్నాన్ని చూచిన శ్రీకృష్ణుడు సత్రాజిత్తును అభినందించి ఆ రత్నం యొక్క మహిమను విన్నాడు. అది అనుదినం ఎనిమిది బారువుల బంగారాన్ని ప్రసాదిస్తుందట. ఆ మణి ఉన్నచోట కరువు కాటకాలు కలుగవు. ఇంత మహిమాన్వితమైన మణి ఉగ్రసేన మహారాజుల దగ్గర ఉంటే దేశానికే మేలు కదా! అన్నాడు వాసుదేవుడు. ముసిముసి నవ్వుల మోమాటంతో సత్రాజిత్తు నా దగ్గర ఉంటే ఒకటీ రాజుగారి దగ్గర ఉంటే ఒకటీనా—అంటూ వెళ్ళిపోయాడు. ఆ మరునాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనజిత్తు ఆ మణిని ధరించి విలాసంగా వేటకి వెళ్ళాడు. నిగనిగా మెరుస్తున్న ఆ మణిని చూసి మాంస ఖండం అని భ్రమించి ఓ సింహం ప్రసేనజిత్తుని చంపి తన

గుహకు వెళ్లుతుండగా భల్లూకరాజు జాంబవంతుడు ఆసింహాన్ని చంపి శమంతాన్ని తీసుకొని వెళ్లి తన కుమార్తె జాంబవతి ఉయ్యాలకి ఆట వస్తువుగా కట్టాడు.

వేటకి వెళ్లిన ప్రసేనజిత్తు తిరిగి రాలేదు. ఈ వార్త విని ద్వారకానగరం గగ్గోలయింది. ఈవార్త అటుప్రాకి, ఇటుప్రాకి క్రొత్తరూపాన్ని పొందింది. అదేమిటంటే, "శమంతకం మీద ఆశతో క్రిష్ణుడే అడవిచాట్లలో పొంచి ఉండి ప్రసేనజిత్తుని చంపి ఆ మణిని తస్కరించాడు" అని. ఇదివిని లీలామానుష విగ్రహుడైన క్రిష్ణుడు తనలో తాను నవ్వుకున్నాడు. యదు వృష్ణి భోజాంధక వంశాన్ని సంఘటిత పరచి వాళ్లకి శత్రుదుర్ని రీక్ష్యమైన సుఖస్థానంగా విశ్వకర్మ చేత విపుల ద్వారకా నగరాన్ని నిర్మించి, ఉగ్రసేనుని చేత ప్రజారంజకంగా పరి పాలన చేయిస్తూ అహరహం వారికోసం శ్రమిస్తున్న తనకి ఒకానొక రత్నం కారణంగా దారుణమైన అపనింద దాపురిం చింది. దీన్ని ఎలాగైనా తొలగించుకోవాలి అనే దృఢనిశ్చయం తో అరణ్యమార్గాలు అన్వేషిస్తూ బయలుదేరాడు అసహాయశూరు డైన క్రిష్ణుడు. మొదట గుఱ్ఱపుగిట్టల జాడలు, ఆ పైన సింహం కాలిగుర్తులు, అటుపైన భల్లూకరాజు పాదచిహ్నాలు-- ఓ కొండ

గుహలో కోటి సూర్యప్రభాభాసమానమైన మణి--మణిని తీసికో బోతున్న క్రిష్ణుని చూసి భల్లూకరాజు జాంబవంతుడు ఎదుర్కొ న్నాడు. వారిరువురికీ ఘోరంగా పోరు జరిగింది. ఏళ్లూ పూళ్లూ గడిచిపోయాయి. క్రిష్ణుని యుద్ధంలో విలాసము, ఉల్లాసము తరగలేదు. జాంబవంతుడు అసలే త్రేతాయుగంనాటి వీరుడేమో! క్రమంగా శక్తిని కోల్పోతున్నాడు. అయినా పరాక్రమిస్తూనే ఉన్నాడు, ద్వారకలో క్రిష్ణుని గూర్చి కొత్తవదంతులు వ్యాపిం చాయి. ఈసారి బతకు మరిలేడు అని. ఇంకేం ఆయనకి ఉత్త రక్రియలు కూడా జరిగాయి మహావైభవంగా. ఆశక్తి కూడా కలిసి మరంత శక్తియుక్తులతో యుద్ధం చేస్తున్నాడు క్రిష్ణుడు. ఇంతలో ఉన్నట్టుండి జాంబవంతుని హృదయం అర్ద్రమై ఒక మెరుపుమెరిసింది. స్వామీ! మీరా! మీతోనా నేను యుద్ధం చేస్తున్నాను.

ఎవరోలే అనుకొంటిని
నీవెవరో కనుగొంటిని
రఘుకుల స్వామివి నాడు
యదుకుల స్వామివి నేడు

ఎవ

నీతో రణరంగమందు
నిలువ దలచి సరిజోడుగ
వరమడిగితి రణమిమ్మని
వరమా యిది శాపమేమొ ఎవ

చివికి చివికి జీర్ణమైన
ముసలి తనువు వశము తప్పె
ప్రాణహంస గగనాంచల
సీమ కెగుర సిద్ధమయ్యె ఎవ

శిరముంచితి పదములందు
కరముల ముకిలింతు దేవ
కరుణా వరుణాలయుడవు
కరుణించుము మోక్షపదవి ఎవ

మణిని గొనుము మధుసూదన
అపనిందలు అంతరింప
కొసరుగ కొను మీ కోమలి
బాలామణి జాంబవతిని ఎవ

జాంబవంతుడు కోరిన మోక్షపదవిని ఆయనకు కటాక్షించి

బంగారు బొమ్మలాంటి జాంబవతిని చేపట్టి ద్వారకకు విజయం చేశాడు స్వామి—ద్వారక చేరినవెనువెంటనే రాజసభను సమావేశం చేసి, సత్రాజిత్తుని పిలిపించి జరిగిన వృత్తాంతాన్ని వివరించి రాజ సమక్షంలో అతని శమంతకాన్ని అతనికిచ్చివేశాడు. శ్రీక్రిష్ణుని శౌర్యము గాంభీర్యము అన్నింటికి మించి నిస్వార్థ ప్రవృత్తి విని సభంతా సాధువాదాలతో, హర్షమోదాలతో మారుమ్రోగింది. సత్రాజిత్తుమారిపోయాడు. సభలోనే తన పశ్చాత్తాపాన్ని వ్యక్తం చేసి క్షమాభిక్షనర్థించాడు. అంతే కాదు తన పుత్రిక, అందాల భరిణి సత్యభామను స్వీకరించి తనను ధన్యునిగా చేయమని అర్థించాడు. వాసుదేవుని కనులలో కలువరేకుల నిగారాలు క్రమ్ముకొన్నాయి. చిరునవ్వులు చిందించాడు. సత్యను వివాహం చేసుకోవాలని తనకూ తనను వివాహమాడాలని సత్యకూ మనస్సులలో మమతానురాగాలు ఈ వరకే అంకురించాయి. ఆ సత్యంచే సామాన్యమా! పృథ్వీ అంశ సంభూత, శృంగార రసదేవత, కుందమందారాల కొమ్మ కుందనపుబొమ్మ ఆకాశమంతా పందిరి, భూమంత అరుగూ వేయించి అంగరంగ వైభవంగా పెళ్లి జరిపించాడు సత్రాజిత్తు. క్రిష్ణస్వామి రుక్మిణీ జాంబవతీ సత్యలతో ఆనంద సామ్రాజ్యాన్ని ఏలుకుంటున్నాడు సత్యంటే స్వామికి మక్కువ ఎక్కువ. ఎందువలన?

శృంగార రసదేవత సత్య
ప్రణయాని కధిదేవత
క్రిష్ణ శృంగార సంగీతరసవీచిక
ముక్కుపై కోపాన మిడిసి పడు వేళలో
చెంప కెంపుల సిగ్గు చిలికించి లీలలో
వలపుకౌగిలి నొదుగు వయ్యారములలో
తనకు తానే సాటి తేనే లేదిక పోటి శృం

వీణ వాయించినా విల్లు సంధించినా
దివి పారిజాతమ్ము భువికి దింపించినా
ప్రాణేశ్వరుని శిరము పాదమున తాచినా
తనకు తానే సాటి తేనె లేదిక పోటి శృం

ముగ్గురు నాయికల ముగ్ధమోహన మూర్తి క్రిష్ణదేవుడు శృంగార సంగీత రసపారవశ్యంతో ఓలలాడుతూ ఉండిన రోజుల్లో ఒకసారి పాండవులను చూడాలని వేడుక పడ్డాడు. అప్పటికి ధర్మరాజు ఇంద్రప్రస్థాన్ని ఇంద్ర సమానవైభవంతో పరిపాలిస్తున్నాడు. క్రిష్ణదేవునికి స్వాగత సత్కారాలు నిర్వహించి ఆప్యాయంగా వ్యవహరించాడు ధర్మసూతి. ఆ పట్టున కొన్నాళ్లు అక్కడేఉన్న స్వామి ఒకనాడు అర్జునునితోయమున

తీరానికి వెళ్లి స్నాన సంధ్యార్ఘ్యానుష్ఠానం ముగించి యిష్టసఖుడైన నరునితో కలిసి ఇష్టా గోష్ఠిలో ఉన్నవేళ అత్యాశ్చర్యకరమైన దృశ్యం కనిపించింది. చెంగట నున్న నదిలోంచి ఓ జలకన్య కలువలు కనులుగా, అలలు మేని మలుపులుగా, తుమ్మెదలు శిరోజాలుగా వెలికి వచ్చి పులిన తీరాల్లో విహరిస్తున్నది. ఆమె కోసమే ఎదురు చూస్తున్నట్టుగా స్వామి ఆమె రాకను ఇట్టే గమనించి అర్జునుని వైపుతిరిగి చిలిపిగా "బావా! ఆపిల్ల ఎవరో! ఏం కావాలో! కాస్త కనుక్కొని రావయ్యా! అన్నాడు. బావగారి అంతర్యం తెలిసిన పార్థుడు 'అంతకంటేనా క్షణంలో కనుక్కుంటాను" అంటూ చరచరా ఆమె దగ్గరికి వెళ్లి అడిగాడో! లేదో—

ఇచట పారేను సెలయేరునై
పొంగి పొరలేను తొలివలపు జాలునై
కలువ కనులై అలలు కలలై
ఇల ఎల్లలను దాటు నాపాట నాబాట
జగతి వెలిగించు వేవెలుగు నాతండ్రి
వెలుగు వెంటాడు నీడ నాతల్లి
పేరు రాలింది, ఊరు మారింది
ఊరు పేరులేని ఊసేదో పిలిచింది

ఆలమందల నేలు అలనాడు నారేడు
జలకమాడిన నాటి తొలితాకులోనే
నీలిమై తళుకు మేనిపై చిలికి
గుండె లోతుల తాను నిండిపోయాడే ॥చట॥

ఇక ఆగికొనలేను ఆవేదనా
కొనసాగ వలెనేమె ఆరాధనా
భావజలధి జీవసేవధి
తనలోన నను లీనము చేసికొనునా ॥చట॥

అన్నది విన్నది విన్నట్టుగా చెప్పిన అర్జునుని మాటలు విని ఆనందించిన స్వామి ఆ తరువాత ఒకశుభలగ్నంలో సూర్యసుత కాళిందీదేవిని గ్రహించాడు. రసస్వరూప, ఆర్ద్రహృదయ అయిన కాళింది అనురాగ సాగరంలో స్వామి తలమునకలయ్యాడు. అటుపైన స్వామికి మరికొన్ని వివాహాలు జరిగాయి స్వామికి అవంతీదేశానికి చెందిన రాజాధిదేవి అనే మేనత్త ఉన్నది. అవంతీదేశం పరిపాలిస్తున్న విందాను విందులు దుర్యోధనుని పలుకుబడికిలోనై తమ చెల్లెలైన మిత్రవింద వివాహానికి స్వయంవరం ప్రకటించారు. స్వామి శౌర్యంతో ఆమెను వివాహం చేసుకున్నాడు. కోసలదేశాన్ని నగ్నజిత్తు అనే రాజు

పరిపాలిస్తున్నాడు. ఆయనపుత్రిక నాగ్నజితి. ఆరాజ్యానికి ఒక ఉపద్రవం వచ్చిపడింది. ఎవరూ ఆదుపుచేయలేని ఏడు వృషభాలు ఆ రాజ్యాన్ని అల్లకల్లోలం చేసి ప్రజాజీవితాన్ని భగ్నం చేస్తున్నవి. నగ్నజిత్తు ప్రకటన మేరకు ఆ సప్తవృషభాలనూ దమించి స్వామి నాగ్నజితిని పెళ్ళాడాడు. తర్వాత శ్రుతకీర్తి పుత్రిక తన మేనమరదలు అయిన భద్రను, అనేక శత్రు రాజులను జయించి మద్రకన్యక అయిన లక్షణను పెళ్లి చేసికొన్నాడు. ఇప్పుడాయన అష్టమహిషీ పరివేష్టితుడు. అటుపైన నరకబాధితలైన షోడశసహస్రకన్యలను రోహిణి మొదలైన వారిని వివాహమాడి ఒక సువిశాల శృంగార సామ్రాజ్యాన్ని ఏలుతుంటుండగా —

కావాలని లష్టమహిషులకీ తెలిసిరావాలనీ కొన్ని కథా కలాపాలను, లీలా వినోదాలనూ స్వామి జరిపాడు. పారిజాతాపహరణ వృత్తాంతంలో సత్యభామకి జ్ఞానోదయం కలిగించాడు దామలందర్నీ అదుపులో పెట్టి ఏలుతున్నాడు. రుక్మిణి దగ్గర ఉన్నప్పుడు సత్యనీ, సత్య దగ్గర ఉన్నప్పుడు మరొకర్ని ఇలా మార్చి మార్చి తలచుకొని నిద్రలో కలవరిస్తున్నట్టు నటించి వాళ్లల్లో వాళ్లకి రవరపలు పుట్టేలా చేశాడు. కాని వారు ఇంతకు ముందే అంతఃకలహాలలో తాగిపల్లారిన కాంతామణులు కావడం

వల్ల ఏలినవారి పొచిక పారలేదు. అంచేత కొత్త కల్లోలం రేపాడు కావాలనీ అష్టమహిషులందరికీ మూకుమ్మడిగా తెలిసిరావాలనీ. ఈ సారి అందరి దగ్గరా రాత్రిళ్లు నిద్రలో రాధపేరు కలవ రించాడు. వాళ్ళకి ఏమీ తెలియలేదు, నిగ్గదీసి అడిగారు ఒక్కొ క్కరికి ఒక్కొక్క సమాధానం చెప్పాడు. మామేనత్త నీకంటే ముందే ఆమెను పెళ్లిచేసుకోన్నాను అని రుక్మిణితోను. నాకంటే అందరికంటే పెద్ద అని సత్యతోను. ఎక్కడుంటుందో ఎవరికి తెలుసు గోకులంలోనో, గోలోకంలోనో అని ఒకరితోను. నాలోనే ఉందని ఇంకొకరితోను నేనే ఆమె అని మరోకరితోను. అసలామె లేదు ఉత్తుత్తికల నేను యధాలాపంగా కలవరించా నేమో అనీ ఇలా ఒక్కొరితో ఒక్కొలాగ చెప్పిన మాట చెప్ప కుండా చెప్పాడు. వాళ్లందరూ ఈసారి కలిసి కట్టుగా కంగారు పడ్డారు. గుంపులుగా గుసగుసలాడారు.

ఏమి చూచి వలచాడమ్మా రాధ
ఎవరికన్న మిన్నోయమ్మా
వెడదకన్నుల వెలుగు చూచెనా దాని
నడకలోని ఒడుపుచూచెనా
మల్లె మొగ్గలంటి పళ్లు

వెన్నెలంటి నవ్వుజల్లు
చిందిన అందాలు చూచి చిత్తైనాడా, వలపు తొత్తైనాడా ఏమి

చిన్ననాడె బుజ్జగించి
కన్నయ్యను లోగొన్నది
గోరుముద్దలందిస్తూ దోరముద్దులిచ్చిందీ
అమ్మమ్మా! ఎన్నిగుండెలే ఓయమ్మా!
రాధమ్మకు ఎన్ని నేర్పులే ఏమి
గోలోకపు వాడలలో
తొలి వెలుగుల జాడలలో
రాధలేక తాను లేననీ ఆమె
జగదేకారాధ్యయేననీ
ఎన్నికతలు సెప్పనేర్చెనే కన్నయ్య ఎన్ని కల్లలాడనేర్చెనే
ఏమి

ఇలా వాళ్లు తర్జన భర్జనలతో తల మునకలవుతుండే రాధ ఎక్కడినించో ఊడి పడ్డట్టు వాళ్లమధ్యకి వచ్చింది. వెలుగుముద్ద లాగ తెలివి పొద్దులాగ ఉన్న ఆమె

అక్కలారా వేద ఋక్కులారా
దిక్కులారా అష్టప్రకృతులారా

అడిగెద మిమ్మొక్కమాట
అది లోకానికి వెలుగుబాట
కన్నయ్యను కన్నదెవ్వరు
చదువు సాము చెప్పిరెవ్వరు
ఆలనేల పాలించెను గో
పాలసుతుల నేల యేలెను అక్క

వేణువేల వాయించెను
వేదమేల వినిపించెను
రాసలీలలో దాగిన
రహోయాగ యోగమేమి అక్క

ఇందరు మీరున్నారు
స్వామి నేల దలచేరు
ఎందరు జీవాత్మల నా
స్వామియేలునో తెలుసా అక్క

క్రిష్ణుడు ఈ మాటల్ని అల్లంత దూరాన వింటూ పొంచి
ఉన్నాడేమో తానూ గొంతు కలిపి-

వనితలారా సుగుణ కలితలారా
మహితలారా మాన్య చరితలారా

చెప్పేద మీ కొక్కమాట అది
లోకానికే వెలుగుబాట
రాధమ్మను కన్నదెవ్వరూ
ఆటపాట నేర్పిరెవ్వరూ
అందరి డెందాల రాధ
ఆనందమ్మేల చిందె          వనిత

రాధ ఆరాధనా
రాధ సంరాధనా
యుగయుగాల రహోగీతిరాధా
సదమల సామార్ధవేది రాధా          వనిత

ఆమెయే మనస్వినీ
ఆనంద తపస్వినీ
జీవ పురుష సమ్మేళన వాహినీ
కేవలానంద సంధాన కారిణీ          వనిత

ఇప్పుడు అష్ట మహిషులకి తెలిసింది రాధఅంటే ఏమిటో. ముద్దుచెల్లెలిగా భావించి ముద్దుచేసి తమ దగ్గరే ఉండి పొమ్మన్నారు. అందరూ ఏకవాక్యంగా ఉండనా పోనా ఉంటే కదా పోవటానికి, పోతే కదా మళ్లీ ఉండటానికి అని కిలకిలానవ్వింది

ఆ నవ్వుల వెన్నెలలో క్రిష్ణశృంగార సామ్రాజ్యం వేయి వెలుగులతో విప్పారింది.

ఇలా ఉండగా ఓసారి నారదమహర్షి ద్వారకకు వచ్చాడు అలా రావడానికి ఆయన మనస్సులో ఒకే ఆశయం. ఇంత మందితో కంసారి సంసారం ఎలా జరుగుతున్నది? ఓ సారి స్వయంగాచూస్తేబాగుండు. క్రిష్ణదేవుని గృహస్థజీవితం గురించి త్రిలోకాలలో గానం చేసి తరించవచ్చు గదా! అని ఎకాయెకిని రుక్మిణీమందిరానికొచ్చాడు. అక్కడ స్వామి ఓక్షణంలో సత్యయింటికి వెళ్లాడు అక్కడ స్వామి. ఇలా ఎన్ని ఇళ్లకి క్షణే క్షణే వెళ్లినా అక్కడ స్వామి. అయితే వేషభాషలూ, కార్యకలాపాలు వేరు. ఇంత బ్రహ్మజ్ఞాని నారదునికి బుర్ర గిరగిరా తిరిగింది. గొంతెత్తి పాడాడు. పదమెత్తి ఆడాడు.

జయ జయ శ్యామల కోమలరూపా
ద్వారవతీ దీపా
జయ బహుకాంతా హృదయాంతర్గత
భవ్య భావరూపా దివ్య ప్రేమ రూపా
అష్టమహిషులన అష్టప్రకృతులు
శతవనితలు నీ శతానందములు

షోడశ సహస్ర శోభామూర్తులు
అందరు నీ ఆనంద కీర్తులు జయ

ఇంటింటికి నే విందనైతినీ
కనువిందుగ నిను గాంచి మురిసితిని
అణువునుండి బ్రహ్మాండమంతటను
నీవే కలవని తెలిసికొంటిని జయ

రుక్మిణి యింటిలో బుక్కుల పఠనము
సత్యమేడలో సంధ్యోపాసన
జాంబవతితో సంగీత సాధనము
ఎట గాంచిన నీ పటునటనమ్ముల జయ

యజ్ఞవేదికల యజనము చేసి
దేవ పీఠముల పూజనలిపెదవు
యజ్ఞవేద విజ్ఞాన స్వరూపా
నీవే అన్నిట నిండి యుండెదవు జయ

గోపాలుర గోపాలమూర్తివి
కేదారమ్ముల కృషీవలుడవు
కర్మయోగ ధర్మా చరణమ్మున
బ్రహ్మ భావ సంభావనచణుడవు జయ

గోలోకమ్మున రాధాపతివీ
వైకుంఠమ్మున లక్ష్మీపతివీ
సర్వలోక ప్రాకృతిక చేతనకు
సర్వకాల పురుషాకృతి వీవె జయ

వనితలెల్ల తన వాడవు నీవని
కౌగిలిలో బంధించి నిలుపుదురు
ఎచట నుంటివని ఎచ్చటలేవని
ఎవరి వాడవని యెఱుగను స్వామి జయ



# క్షాత్ర కృష్ణ

పరిచయం:-

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అన్న వాక్యం ఏ అవతారానికైనా ఆదర్శం. కృష్ణావతారం ఈ ఆదర్శాన్ని ఒక విశాల పరిధిలో బహుమార్గాలలో నిర్వహించి అన్ని ఘట్టాలలోనూ విశిష్టమైన లీలామానుషతత్త్వాన్ని, మాధుర్యలక్షణాన్ని. దివ్యమానుష శక్తుల సమ్మేళనాన్ని ప్రదర్శించడం ప్రత్యేకం. బోసినవ్వుల శిశువుగా పూతనను చంపిన నాటి నుండి ప్రౌఢవీరునిగా దంతవక్త్రుణ్ణి సంహరించిన నాటి వరకూ ఆయన స్వీయముయాతుధాన రాక్షసపిశాచ దుష్టక్షత్రియ గణాలను శక్తి మేరకు దమించినపుడూ, దుష్టశక్తులన్నిటినీ కేంద్రీకరించి ఒక కురుక్షేత్ర సంగ్రామంలో లయింపజేసి నపుడూ, ఆయన భయంకర కాలస్వరూపుడు. రాయబారాలు

నెఱపినప్పుడు, రాజనీతి ప్రవచించినప్పుడూ ఆయన శాంతి కాముకుడైన రాజనీతి కోవిదుడు.

ఎప్పుడైనా ఎక్కడైనా విషాదయోగానికి లొంగక ధర్మ నిర్వహణలో స్వపరభేదమూ, మమతాహంతలు మొదలైన ద్వంద్వాలకి చోటివ్వని స్థితప్రజ్ఞుడు. ధర్మసంస్థాపనే ధ్యేయంగా తాను ప్రవర్తిల్లితన ఆశ్రితులైన పాండవాదులను ప్రవర్తించేట్లు చేసిన అనన్యక్షాత్రమూర్తి. శాశ్వత ధర్మగోప్త.

* * * *

క్రిష్ణునికి ఇంకా నూనుగు మీసాలువచ్చాయో లేదో! నందవ్రజంలో ఆల మధ్యా గోపాలుర మధ్యా పెరిగిన లీలా మోహన జీవితంలో నుండి ఒక్కసారి శత్రు సంహారకేళిలోకి అడుగుపెట్టాడు. అదీ మేనమామ కంసవధతో. కంసుని మీద క్రిష్ణునికి విరోధంలేదు. పూతనాది యాతుధాన శక్తుల్ని పంపించీ కడకు ధనుర్యాగ మిషతో అక్రూరుని చేత మధురకు రప్పించీ, క్రిష్ణుణ్ణి మట్టు పెట్టాలని చూచాడు. వాడి మృత్యుభీతి అలాంటిది. స్వామి అవతారం ఎత్తిందీ, రాజనీతి నెఱపిందీ ఇలాంటి వాళ్ల కోసమే కదా! తొలి సంహార కార్యక్రమ దీక్షితుడు క్రిష్ణుడు తన క్షాత్రకథకి కంసవధతో శ్రీకారం చుట్టాడు.

శ్రీకృష్ణా యదుభూషణా
దుష్టశోషణా శిష్టపోషణా
ధర్మాధర్మ విచక్షణ నిపుణా
మకుటధారియౌ మామకంసుడు
పాపకర్ముడు బహుదుర్మార్గుడు
వసుదేవుని చెర బెట్టినవాడు
రాచపుటక చెడ బుట్టినవాడు
పూతనాది బక ధేనుకాదులను
నిను చంపుటకై నియమించెనుగా
ఆయెల్లరు నీ కోపానలమున
మలమల మాడిరి మిడుతల పోలిక
మామ పిలువగా మధురకు పోయి
కువలయ గజమును చాణూరాంధ్రుల
పటు వీరుడవై పరాక్రమించి
చిటికెలో ద్రుంచితి చిద్విలాసముగ
బంధుత్వమ్మును మమతాహంతలు
దరి చేరని ఓ వీరకిశోరా
కంసునిపై లంఘించి పోరితివి
నింగి నేల కంపించు వేగమున

4

మకుటము ఘల్లున మట్టికరవగా
ముక్కున నోట రక్తము చిందగ
కొండవంటి కంసాధము దేహము
నిండు కొలువులో పడి దొరలాడెను --

మామని మమకారం లేక చంపలేదు. కంసునిపైకనికారం లేక కాదు. ధర్మ నిర్వహణ అసిధారా వ్రతం. దాన్ని అలాగే చేయాలి. అలా అని మానవ సహజమైన వాత్సల్య భావాలకీ, కారుణిక సూత్రాలకీ దూరం కారాదు. తన భర్త శవం కోట గుమ్మం దగ్గర దొరలాడుతుంటే అతని భార్యలూ. జరాసంధ పుత్రికలు అస్తి, ప్రాప్తి కన్నీరు మున్నీరుగా విలపించారు. క్రిష్ణుడి రౌద్రమూర్తి చూచి భయంతో కంపించిపోయి ఎలాగో ధైర్యం తెచ్చుకొని "మా భర్తకి కనీసం ఉత్తరక్రియలన్నా ఘనంగా జరిపించుకోవడానికి అనుమతిస్తారా! స్వామి! అని ఆక్రోశించారు. క్రిష్ణుని కళ్లు చెమ్మగిల్లాయి. "ఎంతమాట! నేను మామయ్యని చంపింది లోకం మేలుకోసం వ్యక్తి ద్వేషం వల్ల కాదు వైభవంగా జరిపించండి" అన్నాడు.

కనులు చెమ్మగిలి మనసు సొమ్మసిలి
కంస గేహినులు కరములు మోడ్చిరి
కరుణా కలిత హృదయమ్మున కంసుని
ఉత్తరక్రియలకు ఉత్తరువొసగితి

చనుబాలు త్రాగవలసిన పసితనంలోనే తాను దేవకి వసుదేవులకి దూరమయ్యాడు. వాళ్లు ఇన్నాళ్లూ చీకటి కోణం అట్టడుగున చెఱసాలలో బండ రాళ్లమీద కటకటాల మాటున క్రుంగి కృశిస్తున్నారు. వాళ్ళని చూడాలి, ఇన్నేళ్లు దూరమైన మమతామాధుర్యాలని చవి చూడాలి. వాళ్లకాళ్లని కన్నీళ్లతో కడిగి క్షమాభిక్ష అర్థించి ఇకనైనా వృద్ధాప్యంలో వాళ్ళజీవితం సుఖమయం చేయాలి అనుకుంటూ చరచరా చెరసాలకి సాగి పోయాడు.

చెరలో నవసిన జననీజనకుల
చేరి భక్తితో చెరవిడిపించితి
ఇలచేవతలౌ తలిదండ్రులను
సేవించుచు జీవించితి స్వామి --

ఇదంతా ఎందుకు చేశాడు. తనకేం కావాలి. ఏమీఅక్కరలేదు.భోగభాగ్యాలు రాజ పదవీకాదు తన ధ్యేయం. అందుకనే

సింహాసనమును గడ్డిపోచగా
త్యజియించిన ఓ త్యాగశీలీ
ఉగ్రసేను రాజ్యమ్మున నిలిపితి
తరలి వెడలితివి గురుసేవకునై --

గురుసేవ వల్ల విద్యను నేర్చుకొననిదే పరమాత్మ కూడా తరించడు కాబోలు. ఈ ఆదర్శం లోకానికి చాటడానికి తల్లి దండ్రుల అనుమతితో అవంతీ పురప్రాంతవాసి సాందీపనిని సేవించి విద్యావంతులయ్యారు రామకృష్ణులు. గురుదక్షిణగా మృతుడైన సాందీపని పుత్రుని బ్రతికించడం పంచజనుడనే సాగరాంతర రాక్షసుని ఎముకనుండి శంఖాన్ని పాంచజన్యాన్ని పొందడం స్వామి గురుకుల జీవన ఫలాలు

సాందీపని పాదారవిందముల
శ్రద్ధాభక్తుల సేవించితివి
అరువది నాలుగు శాస్త్రసారముల
అరువది నాలుగు దినముల నేర్చితి --
మృతుడౌ గురుసుతు బ్రతికించుట నీ
కరుణా ఫలమని గురువులు తలచిరి
గురుసేవా పరతంత్ర భావమున
అరుదౌ నీ కథ జగముల బ్రోచెను --
మధురానగరికి మరలివచ్చితివి
జనజీవన సంక్షేమములరయగ
దీనానాథుల సేవాభావము
కోరి వరించితి గోపాలాగ్రణి

గురుకులం నుండి తిరిగివచ్చిన కొంతకాలం హాయిగా జీవితం దీనానాధసేవగా సాగిపోయింది. ఏం లాభం? మధుర కి కష్టాలు మొదలయ్యాయి. తన అల్లుడైన కంసుని చంపిన కృష్ణునిపై పగబట్టిన మహావీరుడు జరాసంధుడు విజృంభించాడు [illegible]వడు తనచేత చావడు. భీముని చేతనే వానిమృతి సాధ్యం. [illegible]లం వెళ్లదీయాలి. నిదానంగా ఆలోచించి ఒక నిర్ణయానికి [illegible]చిన స్వామి శత్రు దుర్భేధ్యమైన ద్వారకా నిర్మాణం [illegible]యించాడు. కాలయవనుని లీలగా చంపించాడు. రాజసూయం [illegible]పనుగా జరాసంధ వధ చేయించాడు. శిశుపాలుని చంపాడు. [illegible]టి రాజలోకంలో మకుటం లేని మహారాజుగా. సాటిలేని [illegible]టి వీరునిగా దిగ్దిగంత విశ్రాంత యశస్వి అయ్యాడు.

మధురా నగరపు మధుర జీవనము
జరాసంధ జర్జరితమయ్యెను
పౌరులెల్ల భయభ్రాంతులు కాగా
పలు మార్లాతడు పరాక్రమించెను --
విశ్వకర్మ నాహ్వానము చేసి
విపుల ద్వారకను నిర్మించితివి
కడలి నడుమ కడు పదిలముగా
అసురుని ధాటకు ఆగునటులుగా --

అందు ప్రశాంతానంద జీవితము
అనుభవించితివి కొన్ని నాళ్లుగా
జరాసంధ సంప్రేరితుడై వడి
కాలయవనుడను అసురవచ్చిపడె —
లింగ యవనుని కాలరాయుటకు
నిరాయుధుడవై నిర్గమించితివి
వెంటాడితి క్రిగ్గాడి రక్కసుని
ఒంటీ అంటక అలయింటివి —
చిరసుప్తుంతును వరభక్తుందును
అగు ముచికుందుని నేత్రానలమున
కాలయవనకథ గడచిపోయినది
కృష్ణలీల జగమెల్ల మ్రోగినది —
సదమల భావుడు పాండవాగ్రజుడు
సంకల్పించెను రాజసూయమును
జరాసంధ వధ జరుగకున్నచో
నెరవేరదు కద రాజసూయము —
విప్రవేష విభ్రాజిత మూర్తి
భీమార్జునులతో మగధకేగితివి

యుద్ధభిక్ష నర్థించి మాగధుని
యోద్ధ భీమునిచె చంపించితివి —

నిర్విఘ్నమ్ముగ రాజసూయమది
నెఱవేరుట నీ కరుణాఫలమని
నిష్కంటకమే రాజలోకమును
జను లెల్లరు ఆనందమందిరి —

విశ్వమయుండవు శాశ్వతమూర్తివి
ధర్మమార్గ సంధాన మహితుడవు
అగ్రపూజనీ కర్పించుటకై
సభయందెల్లరు సన్నద్ధులుగా —

పురావైర సంపుష్ట దౌష్ట్యమున
దూలనాడె శిశుపాలుడు బాలుడు
నూరు తప్పులను మీరిన మూర్ఖుని
చక్రాయుధమున సంహరించితివి —

వాని దేహమున వెలువడి తేజము
నీ దేహమ్మున చేరుట బ్బురము
పగచే రగిలిన పాపికి సైతము
కటాక్షించితివి మోక్షానందము —

కాలం గడుస్తున్నది, ప్రస్తుతం స్వామి మకుటధారి కాక పోయినా మకుటధారులైన మహారాజులు సైతం ఆయన సన్నిధిలో భీతభీతులై వినయంగా ఉంటారు. ఋషీంద్రులు, దేవతా మూర్తులు సైతం ఆర్తులై ఆయన పాదాలాశ్రయిస్తారు. ఆయన బ్రహ్మణ్యదేవుడు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు. ఆయన ఎదుర్కొని వధించిన మరొక బలవద్విరోధి మహావీరుడు పరాక్రమశాలి నరకాసురుడు. అదితి కుండలాలనూ, అప్సరో మండలాలనూ ఆహరించి ప్రాగ్జ్యోతిషంలో బంధించిన బలశాలి. అతడు కన్నుమూయంచే ఖవిమానవులూ, దివిదేవతలూ బ్రదికి బట్టకట్టలేరు. అలా అని విన్నవించుకొన్న ఇంద్రుని మాటమేరకు స్వామి నరకాసుర దమనం చేశాడు. తీరాచూస్తే వాడెవడో కాదు నారాయణమూర్తిగా తననెపుడూ సేవించే ప్రథమపత్ని భూదేవి పుత్రుడు. స్వామియుద్ధంలో భాగస్వామినిగా వచ్చిన సత్యభామ భూదేవి అంశ. అంటే తల్లిదండ్రులు అవరావతారాలలో అనుగుబిడ్డని చంపడానికి వెళ్లుతున్నారు--

విసుడు వినుడిది క్రిష్ణదేవుని

వీరగాథా కథనమూ

శిష్టరక్షణ దుష్టశిక్షణ

నిర్వహించిన ఘట్టమూ
భూమిపుత్రుడు సురల శత్రువు
నరకదైత్యుని చంపగా
సత్యభామను వెంటనిడుకొని
సమర సీమకు కదిలెను విను

వీరశేఖరమూర్తియై ముర
దానవుని తా సంహరించగ
నరక విజృంభణము పెల్లై
నభము నేలయు దద్దరిల్లెను విను

నరకుడేసిన బాణముల వడి
మురహరుండును మూర్ఛపోయెను
వెంటవచ్చిన సత్యభామయు
వింటి నమ్ముల విడచుచుండెను విను

మూర్ఛ తెలిసిన క్రిష్ణ శంఖ
ధ్వానమున ముజ్జగములదలెను
భీకరాహవ భీతిమునిగిన
సకల సృష్టియు సంచలించెను విను

జాగుచేయుట బాగుకాదని
స్వామి చక్రాయుధమునంపెను
చక్రధారల నరక శీర్షము
ఖళ్లుమని యిలపైన త్రెళ్లెను వినుGRAPH

పురాగేహిని పుడమి క్రిష్ణుని
పురోభాగము నందు నిలిచెను
మింటికిని మంటికిని ధారగ
కంటి నీరొలికించె భూసతి వినుGRAPH

క్రిష్ణుడుపదేశించె కాంతకు
తృష్ణ సంగా తీత తత్త్వము
నరకు పుత్రుని రాజొనెర్చెను
నరకు తల్లికి ముదముకలుగగ వినుGRAPH

నరకు కారా గారమున గల
అప్సరల నలరించి క్రిష్ణుడు
వారలను తనవారిగ గైకొని
ద్వారకకు విజయమ్ము చేసెను వినుGRAPH

క్రిష్ణ వీరగాధలో ఇంకో ఘట్టం పౌండ్రక వాసుదేవవధ. వీడో విచిత్రమైన రాక్షసుడు. అసలు వాసుదేవుడు తానేననీ తన

నామరూపాయుధాది చిహ్నాలు క్రిష్ణుడు ధరించాడనీ ఆరోపించి, ఎవరు నిజమైన క్రిష్ణుడో తేలాలని మచ్చరించి ఏకాయికి యుద్ధానికి వచ్చాడు. పాపం పౌండ్రకుడు సారూప్యవైరంతో తరించాడు.

వినుడు వినుడయా వీనుల విందుగ
క్రిష్ణ వీరగాధ యిది దుష్టదమనగాధ
ఇది శిష్టభరణ గాధ
గర్వాంధుండగు కరూశభూపతి
పౌండ్రక నాముడు పరమనీచుడు
క్రిష్ణద్వేషియై కష్టచరితుడై
క్రిష్ణునిపై మచ్చరము పెంచుకొనె వినుడు
శంఖము చక్రము వనమాలయు ని
శ్శంకగ కస్తూరి తిలకమాదిగా
క్రిష్ణ చిహ్నములు ధరించి తానే
క్రిష్ణుడనని లోకమున చాటుకొనె వినుడు
తన చిహ్నమ్మును క్రిష్ణనామమును
తన బిరుదమ్మును స్వామి వదలవలె
కరూశాధిపు క్రిష్ణత్వమ్మును
ద్వారకాధిపుడు తలదాల్చగవలె వినుడు

అన్న పౌండ్రకుని వర్తమానమును
విన్న స్వామి దావానలమాయెను
రణరంగమ్మున రమ్మని చూతమని
రణభేరిని మ్రోగించి కదలెను     విను

భీకర సంకుల సమర రంగమున
నాకము చేరెను నకిలీ క్రిష్ణుడు
వాని కొడుకు శివు వాల్లభ్యమ్మున
దారుణకృత్యను ద్వారక కంపెను     విను

దారుణాగ్ని జ్వలనమ్మున ద్వారక
కూడనున్న సమయమ్మున మాధవు
చక్రమ్మున నాకృత్య సమసినది
కరూశ రాజుల కథముగిసినది     విను

రాక్షసులు రకరకాలు. పరమేశ్వరుణ్ణి గూర్చి కఠోర తపస్సు చేసి శక్తులూ యుక్తులూ. ఆయుధాలూ, పరికరాలూ, వస్తువాహనాలూ సంపాదించినా జ్ఞానం కలగని మూర్ఖులు. లోతుగా విచారిస్తే జన్మాంతర సంస్కారాలవల్ల వైర సంధాన మార్గంలో స్వామిపై పగబట్టి యుద్ధంచేసి మరీ ముక్తి గెలుచు కొన్న భక్తులు. సాళ్వుని కథ అలాంటిదే. వీడూ శిశుపాలుడూ ఒకలాంటి వాళ్లు. అంటే జన్మాంతరాన జయవిజయులు.

వినుడు వినుడిది క్రిష్ణదేవుని
వీరగాథా కథనము
దుష్టశిక్షణ శిష్టరక్షణ
నిర్వహించిన ఘట్టము
సాళ్వభూపతి దంతవక్త్రుడు
శర్వునారాధించి పొందెను
సర్వశత్రుభయంకరమ్మగు
సౌంభకమ్మను వ్యోమయానము

ద్వారవతిపై దండు విడిసెను
క్రూరుడౌ సాళ్వుండు బలమున
సౌంభికమ్మను సర్వసైన్యము
సాయమై సన్నాహమలరగ

అపుడు క్రిష్ణుడు లేడు ద్వారక
అరిగె పాండవ దర్శనార్థము
సాళ్వఘాతకు ద్వారకాపురి
తల్లడిల్లెను విహ్వలమ్ముగ
వీర ప్రద్యుమ్నాది యదువులు
ఘోర ధూమ్రాకృతుల దాకిరి

సమర రంగము నందు సాళ్వుని
సహకరింపగ నుద్యమించిరి — విను

అసలు తానొక పెద్దవీరుడు
కొసరుగా శంభుప్రసాదము
సెగలు పొగలుగ సాగెయుద్ధము
గెలుపు నోటమి తెలియకుండగ — విను

స్వామి వచ్చుట చూచి సాళ్వుడు
సంగరమ్మున చెంగలించెను
పుదకు మాయాజాలమున వసు
దేవు శిరమును త్రుంచి చూపెను — విను

గురుని మరణము చూచి స్వామికి
కరుణ మెదలో త్రుళ్ళుకొన్నది
గుండె పగులగ నేడ్చినాడా
దండి మగడును ధీరుడై — విను

ఇప్పుడెవ్వరో తెలిపినాతని
కరితయును దనుజేంద్రుమాయగ
అంత స్వామియు విజృంభించెను
అంతకాకృతి. దాల్చినట్టుల — విను

స్వామిగదచే ఖన్నమయ్యెను
సౌంభకమ్మను వ్యోమయానము
చక్రధారల త్రెళ్లిపడినది
సాళ్వభూపతి శిరము రణమున వినుః

ఇంతకాతం డెవ్వరందురు
స్వంతముగ మాతులుడు స్వామికి
చచ్చిపోయిన చేదిభూపతి
మెచ్చుమిత్రుడు స్నేహసేవధి వినుః

మిత్రులిరువురు క్రిష్ణద్వేషులు
శత్రుభావమునందు చతురులు
మూడు జన్మల వైర సాధన
ముచ్చటగ మోక్షమ్ము నందిరి వినుః

ఇలా సాగి వచ్చిన క్రిష్ణ ఛాత్రగాధ గేయంగా. మేని హృద్గేయంగా లోకలోకాంతరాల మారు మ్రోగింది.

జయజయ శ్యామల కోమల రూపా
విశ్వగేహదీపా
సాధుత్రాణ పరాయణనిపుణా దుష్టభావ దమనా
శిష్టభావ ప్రవణా

ఏ యే వేళల ధర్మము చెడునో
ఆయా వేళల అవతరింతువూ
ధర్మము నిలిపి అధర్మము నడపగ
యుగయుగముల ఓ జగతీనాయిక జయ

శైశవమున పూతనతో మొదలై
ముసలి వయసున సాళ్వుని వరకు
నిరతము రాక్షస నిరాసమ్మె
జరిపితి వ్రతముగ ధర్మము కొరకై జయ

క్రూరకర్ములను పోకాసురులగు
జరాసంధుని బాణాసురుని
కారయితగ హరియించిలోకమున
శాంతి సౌఖ్యముల స్థాపించితివి జయ

పాండవ కౌరవ సంఘర్షణలో
పాండవ పక్షము నవలంబించి
కురుక్షేత్ర సంగ్రామ రంగమున
క్రూర భూపతుల కూల్చివైచితివి జయ

నరుని నిమిత్తునిగా నొనరించి
నరజాతికి గీతార్థమొసగితివి

యుగ యుగముల నీ గీతనాదము
జగములెల్ల నినదించును స్వామీ జయ

యాదవకులమున ముసలము వలన
యదువంశము నశియించి పోవగా
భేద ఖేద భావమ్ముల నందక
చిన్మయముగ చిరునవ్వు నవ్వితివి జయ

అహంకార మమకార లేశమును
దరిరానీయని ధర్మపరుడవై
జ్ఞాన కర్మ వైరాగ్య సిద్ధితో
తేజరిల్లితివి దేశిక శేఖర జయ



# దయాకృష్ణ

## పరిచయం:-

కృష్ణుడు దయామూర్తి తనను ఆశ్రయించి శరణమందిన ఎందరో భక్తుల్ని వారి వారి స్థాయిని బట్టీ సంస్కారాన్ని బట్టీ కటాక్షించిన కరుణామయుడు. ఒక రకంగా చూస్తే భగవంతుని కథ భక్తికథ-భజనం భక్తిః అన్నారు. ఆచార్య శంకరులు "మోక్షసాధన సామగ్ర్యాత్ భక్తిరేవగరీయసీ" అనీ, "స్వస్వరూపానుసంధానం మోక్ష మిత్యభిధీయతే" అనీ ప్రవచించి సాధన మార్గాలలో భక్తితత్త్వము యొక్క విశిష్టతని లోకానికి చాటి చెప్పారు. దేవుని నుండి విడివడిపోయిన జీవుని వేదన భక్తి. వేదనపడి తపించి స్వామిలో ఐక్యం చెందడం భక్తి కథ మూలసూత్రం. ఆయా భక్తుల హృదయ సంస్కారాన్ని బట్టి మార్గం ఉంటుంది. భావసాంద్రతనుబట్టి, తీవ్రతనుబట్టి ఫలితం

వేగంగానో, ఆలస్యంగానో సిద్ధిస్తుంది. మార్గాలు వేరైనా జీవ పురుష సమ్మేళనమే గమ్యస్థానం. ఎందరో భక్తులు నిరంతర విష్ణుకథా శ్రవణంచేత, పాదసేవనంచేత, అర్చనచేత, వందనం చేత, దాస్యంచేత, సఖ్యంచేత, ఆత్మానివేదనం చేత తరించారు. ఆయా మార్గాలను పురస్కరించుకొని నవవిధభక్తులని పెద్దలు లెక్క చెప్పారు. లెక్కకేంగాని కృష్ణావతార కథంతా లెక్క లేనంతమంది భక్తులచరిత్రతో నిండిఉన్నది.అంచేతనే భాగవతం భక్త్యుపనిషత్తు అనడం. ఒక ద్రౌపది, ఒక కుంతి, ఒక భీష్ముడు కుచేలుడు, అక్రూరుడు, ఉదంకుడు, నరుడు, విదురుడు, పాండవులు ఒకరేమిటి నిదానించి చూస్తే సమకాలీన జగత్తులో ఆయన భక్తులు కానివారెవరైనా ఉన్నారా! అనిపిస్తుంది. అయితే రుచి భేదము, అభిరుచి వాదమూ అంతే. ఆయా భక్తుల కథలను పూలగా పోగుచేసుకొని స్వామికి పదమాలికగా అర్పిస్తే అందులో పెద్దపువ్వు గోపికలు. అందుకనే భక్తితత్త్వాన్ని నిర్వచించిన నారదులు భక్తికి పరాకాష్ఠగా ఉటంకిస్తూ "యథా వ్రజగోపికానాం" అన్నారు. అంటే భక్తుల కథలు అనే మెట్లు ఒక్కొటీ ఎక్కుతూ పోతుంటే చివరిమెట్టుగా గోపికల కథ చేరుతాం.

* * *

# 3

బహుశా భారతకథలో ఆ మాటకి వస్తే ప్రపంచ సాహిత్యంలో కుంతివంటి విషాదపాత్ర ఎక్కడా కనుపించదు. చిన్ననాటి కుంతి భోజుని గారాల పట్టిగా ఏమైనా సుఖసంతోషాలను చవిచూచిందో! లేదో గాని ఆ తరువాత ఆమె జీవితంలో ప్రతిఘట్టమూ విషాదమే. జీవితమంతా నిరాశానిస్పృహాలతో పోరాడి పోరాడి ఓడిపోయి స్వామి పాదాల దగ్గర కాస్తంత ప్రశాంతికై అలమటించిన ఉదాత్త ఆత్మకథ కుంతీదేవిది. దుర్వాసమహర్షి వరం శాపంకాగా తొలిచూలు గంగపాలుచేసుకొని అలమటించిన మాతృమూర్తిగా. శతశృంగ పర్వత సానువులలో నుదుటి కుంకుమ చెరిగిపోగా తన బిడ్డల్ని, మాద్రి బిడ్డల్ని అక్కున చేర్చి పాలించి. హస్తినాపురంచేరి వారినిపెంచి పెద్దచేసిన క్షమామూర్తి కౌరవ దురన్యాయాలకు గురైన కన్నబిడ్డల కడగళ్లు తప్పించలేక హస్తినాపురం అంతఃపురం పరదాల వెనుక కుంగికృశించి పోయిన దీనమూర్తి. కురుక్షేత్ర సంగ్రామంలో పెద్ద కొడుకు శవాన్ని వెదకించి ఉత్తరక్రియలు జరిపించిన గంభీరమూర్తి. జీవిత చరమసంధ్యలో ఉత్తరాగర్భాన్ని రక్షించుకోవడంకోసం ఆవేదనల భావోద్వేగంతో క్రిష్ణుని ప్రార్థించ వలసి వచ్చిన కరుణామూర్తి- ఇన్ని దశలలో ఇన్ని బాధలగాథల మధ్య ఆమె

మనస్సుకి ఊరట కల్పిస్తూ, కాపాడుతూ వచ్చింది క్రిష్ణ
స్వర్యాను క్రిష్ణుడు. మొదట తన పిల్లల మంచి చెడ్డల్ని
కాపాడే మేనల్లుడు. కొన్నాళ్ళకి దివ్యమానుష సంకేతం.
కొంత కాలానికి సాక్షాత్తు క్రిష్ణ పరబ్రహ్మ...

అడుగడుగున నీ అండదండలే
నడిపించెను నను కన్నయ్యా
కడసారిగ నా కోరిక తీర్పుము
కరుణాసాగర! క్రిష్ణయ్యా!

పాండవులను రక్షింపుమంటినీ
కౌరవులను శిక్షింపుమంటినీ
మేనల్లుడవని చనువు తీసికొని
కోరికలెన్నో కోరితినీ

వయసు చెల్లినది మమతలుడిగినవి
కోరుట లేమిక మిగిలినదీ
విషాద మయమే కుంతికి జీవన
ప్రశాంతి నొసగుము స్వామీ

అత్తగారి పోలిక చారికా. అన్నిట్లో అందిపుచ్చుకు
మరొక విషాదమూర్తి ద్రౌపతి. ఆ మాటకొస్తే అత్తగారికన

అధికంగానే ఆరళ్లూ కన్నీళ్లూ అనుభవించిన ఇల్లాలు. అయితే నిజగా వరము వల్ల పుట్టిన యాజ్ఞసేని. అసహాయ శూరులైన అయిదుగురు మహాత్ముల అర్ధాంగి. అయినాసరే నిండు సభలో ప్రపంచ చరిత్రలోనే యే పతివ్రతకి జరుగని మహావమానానికి గురియై స్వామి దయచేత మానం కాపాడుకొన్న మానవి. అరణ్యాలలో అలమటించింది. అజ్ఞాతంలో పరపంచల ఊడిగం చేస్తూ పలవించింది. ఇదంతాకాక సైంధవ కీచకాదుల కామాంధ ప్రవృత్తిని ఎదుర్కొన్నది. కన్నబిడ్డలు బ్రాహ్మణబ్రువు అశ్వత్థామ కత్తివాదరకు ఎరయిపోతే కరుణం పరాకాష్ఠను చేరుకున్న గడియలోనే క్షమించి ప్రాణంకాపాడమని ప్రార్థించిన కరుణామయి. ఇన్ని జీవిత సన్నివేశాల అలజడిలో, ఉరవడిలో కొట్టుకొనిపోతూ ఒక్క ప్రతిజ్ఞను, పట్టుదలనునిలిపి నిలువరించుకొన్న ధీర గంభీరమూర్తి. కురుసభలో దుశ్శాసనుడి క్రూర హస్తం పట్టి లాగిన కేశపాశం ముడివేయక పగతో రగులుతూ రారాజు పీనుగ కన్నారగాంచే దాకా నిద్రపోని వీరవనిత. ప్రతినలు చెల్లి మహారాజ్ఞియై ఆటుపైన పాండవులతో బాటు మహాప్రస్థానం చేసిన పతివ్రతా శిరోరత్నం. క్రిష్ణదేవునికి చెల్లెలుగా చనువూ, సంబరమూ చవిచూచింది. భర్తృరాలిగా

ఆయన అభయహస్తం నీడన జీవితం పండించుకున్నది. చరమ దశలో ఆయన శుద్ధ బ్రహ్మ చైతన్యానికి ఆత్మార్పణం చేసుకున్నది---అదిగో ఆమె ద్రౌపతి అంటే—

ఎన్నిమారులు నన్ను కాపాడితివి స్వామీ
ఎన్నటికి నీ ఋణము తీర్పగలనయ్యా
కన్నీట పాదాలు కడుగనా
గొంతెత్తి నీ గాథ పాడనా

నిండుకొలువున తులువ వలువ లొలిచిననాడు
గుండె పగిలిన చెల్లిగోడు నీ చెవిసోకి
మది కరగి దయకలిగి మమకారముపొంగి
వలువలొసగిన మేలు మరువ గలనాస్వామి ఎన్ని

కామాంధ భూపతులు గర్వాంధ తాపసులు
కబళింపరా నన్ను నీ కరుణ లేనిచో
దీనానాథుల రక్షించుటనీ
దీక్షకదా లోకావన దక్షా ఎన్ని

విడివడి పోయిన ద్రోవది జడముడి
తడిపించితి దాయదుల నెత్తుట
గుండె రగులు కోపాగ్ని నార్పితివి
కౌరవ వనితల కన్నీళ్లతో ఎన్ని

ఎల్ల జన్మముల చెల్లెలినై నీ
చల్లని నీడన బ్రతుక గోరెదను
నీపద సీమయె మోక్షపదముగా
దీనురాలి దయచూడుము స్వామీ ఎన్ని

భారత క్షాత్రాకాశంలో శాశ్వత ధ్రువతార భీష్ముడు. అష్టవసువుల అంశాల సమిష్టి వెలుగుముద్ద. పవిత్ర గంగానదీ పుత్రరత్నము, పరశురామశిష్యుడు భీష్ముడు. నూనూగుమీసాల నూత్న యౌవనంలోనే విధిచోదితుడై తనపితృదేవులు శంతనుని కోసం వివాహాన్ని, సింహాసనాన్ని త్యజించి ఆజన్మ బ్రహ్మచారిగా జీవించిన బ్రహ్మజ్ఞాని దేవవ్రతుడై పుట్టిపెరిగి భీష్ముడైనాడు అపార అర్థవిజ్ఞానాన్ని ఆర్జించుకున్న ఆచార్యులు. సత్యవతీదేవికిచ్చిన వాగ్దానం మేరకు కౌరవసింహాసనాన్ని ధర్మోత్తరంగా నిలువరించాలని శక్తియుక్తులు ధారపోసి అనుక్షణం తన ఆశాసౌధం పగిలి బీటలు వారుతుంటే ఏమీచేయలేక కొట్టుమిట్టాడిన నిస్సహాయుడు. కౌరవపాండవ ఘర్షణలో ధర్మాన్ని ప్రవచించాడే కానీ అధర్మాన్ని అడ్డుకోలేకపోయాడు. పూర్వవిరోధం వల్ల ఆడది అంబ పేడిగా ఎదుర్కొంటే అస్త్రసన్యాసం చేశాడు

అర్జున బాణ సముద్రానికిఆగలేక పతనమైనాడు. ఉత్తరాయణ పుణ్యకాలం వరకూ ఎదురు చూచి తన విజ్ఞాన సర్వస్వాన్ని క్రిష్ణప్రేరితుడై ధర్మరాజుకి బోధించిన దేశికోత్తముడు. రాజసూయ యజ్ఞంలో క్రిష్ణునికి అగ్రపూజ చేయించిన నాటినుండి ఆయన దివ్యతత్త్వాన్ని గుండెలోతుల పదరు కొల్పుకొని ఆరాధించిన మహా మనీషి. అంపశయ్య మీద అధివసించి క్రిష్ణుని జగన్మోహన లీలా విలాసాలను పదేపదే మననం చేసుకుంటూ ఆయన పరబ్రహ్మమై తత్వంలో లీనమైన శరణాగతుడు. ఎంతటి వారికైనా నిర్యాణం ఒక సహజమైనదనీ, క్రిష్ణ పరబ్రహ్మ అనుగ్రహమనీ భావించి...

నిర్వాణ సుఖమందనీ
సర్వ గీర్వాణ పదమందనీ
నీ విశ్వమోహన శాశ్వతమ్ముగ నిలిచి
దరహాస మధుమూర్తివీ స్వామి
పరిహాస ఘనకీర్తివీ
గోపిహృద్వారాల గోలోకరాజ్యాల
చిన్మయమ్ముగ వెలుగు శ్రీవాసుదేవా     నిర్వాణ
ఆలుబిడ్డలు లేనివాడ
ఒకరేమియు లేనివాడ

9

నీపాదపద్మాల నెరనమ్మి శరణంటి
కరుణించవయ్యా ఓ కల్యాణగుణధామ    నిర్వాణ

తప్పులెన్నియొ జేసినాను కాని
మాట తప్పక నిలిచినాను
ముసలి తనమున నిపుడు వలసినది లేదయ్యా
కైవల్య మీవయ్యా కల్యాణగుణధామ    నిర్వాణ

సాందీపని దగ్గర స్వామి చదువుకున్న రోజుల్లో చనువైన సఖుడు కుచేలుడు. చిన్నప్పుడు సుదాముడు. కన్నయ్యతో కలిసి ఆడిపాడుకున్న నేస్తం. చదువు సాముల్లో దిట్ట. వేదవేదాంగ విదుడు. యజ్ఞయాగాదులు నిర్వర్తించిన నైష్ఠికుడూ అయిన సుదాముడు తరించడానికి దారిద్ర్యం కారణమైంది. గంపెడు పిల్లలతో సంసారం ఈదలేక దినదినగండం నూరేళ్లాయుష్షుగా బ్రతుకుతూ చినిగిన బట్టకట్టుకున్న యీ బడుగుబాపనయ్యకి విక్లుప్రాప్తిగా కుచేలనామధేయం సార్థకం కాగా ఇల్లాలు కామాక్షి చెవిన్నిల్లు కట్టుకొనిపోరి, కొల్లాయి గుడ్డలో కాసిని అటుకులు మూటకట్టి క్రిష్ణదేవుని దర్శనానికి పంపింది. సిరిని వరంగా కోరమని పదేపదే హెచ్చరించింది. ద్వారకాపురవీథులు నగళ్లు ఎలాగో దాటి క్రిష్ణదర్శన కుతూహలంతో అంతఃపురం చేరుకు

నల్లనయ్యకి నమస్కరించింది మొదలు బాపనయ్య కథ మారి పోయింది. బ్రహ్మణ్యదేవుడైన శ్రీకృష్ణుడు బాల్యమిత్రునికి అర్ఘ్య పాద్యాలర్పించి. సింహాసనంపై కూర్చుండబెట్టి, పాదపూజచేసి, పాదతీర్థం నెత్తిన చల్లుకొని అష్టమహిషీసహితుడై అనన్య సన్మానం చేసి అటుకులు ఆరగించి ఆనందించాడు. కుశల ప్రశ్నలూ, చిన్ననాటిముచ్చట్లూ అయ్యాక ఆస్వామి సన్నిధిలో తన్ను తాను మరచిన కుచేలుడు పరబ్రహ్మ సాక్షాత్కారం పొందిన భక్తునిలాగా ఆనంద సముద్రంలో తలమునకలై శ్రీకృష్ణ కథాగానం చేసుకుంటూ ఇంటిత్రోవ పట్టాడు. ఐశ్వర్యం బ్రాహ్మడు అడుగలేదు. దేవుడు ఇస్తాననలేదు.

తీరా యింటికి వస్తే పూర్వ దారిద్రదృశ్యం మారిపోయి అపూర్వైశ్వర్యలోకం సాక్షాత్కరించింది.

ఎంత మధుర స్నేహమయ్య
నీదెంత మంచి హృదయమయ్య
ఇడుములలో పడి నలిగిన బడుగుబాపనీ
కలుములొసగి గౌరవించి కాపాడావు
చిన్ననాట నిన్ను గూడి చదివాను
గురుదేవుల కృపాలహరి మునిగాను
చదువ తగిన చదువేదీ నీవుతప్ప ఎంత

యజ్ఞదాన తపోదీక్షలెన్నైనా
వేద శాస్త్ర పాండిత్యము మెండైనా
నీ పాదములాశ్రయింపకుండేనా
భక్తిలేక మా బ్రతుకులు పండేనా     ఎంత

అటుకులు తిని పేదవానినాదరించి
సిరితామర తంపరగా కరుణించావు
సిరిమత్తున నీ పదములు మరువకుండ
కరుణింపుము సర్వలోకపాలకుండ     ఎంత

మరల మరల జనన మరణ వలయమందు
తిరిగితిరిగి చిక్కుకొనుట వలదు స్వామి
తప్పిదారి జన్మించుట తప్పదంటే
నీ నేస్తంగా జన్మిస్తా ఒప్పుకుంటే     ఎంత

ఓసారి క్రిష్ణభక్తుల పరంపరని చూస్తే ఎవరనీ, ఎందరనీ ఒక్కొక్కరికి ఒక్కొవ్యధ. ఒకకధ. ఆయనకి సమకాలీనులై జీవించి సేవించి అందరూ అన్ని విధాలుగా తరించారు. బాల క్రిష్ణుడు మధురాపుర వీధుల్లో తిరుగుతుండగా ఆయన దివ్య మోహన తత్వానికి అంజలించి కుసుమదామాలతో అలంకరించి "వరంకోరుకో శ్రీదామా!" అంటే "నీ దివ్యదర్శనం లభించాక

కూడా నాకు వరం కోరుకునే దారిద్ర్యమెందుకయ్యా! నీ పాద కమలాలని సేవించుకుంటూ, నీ భక్తుల గోష్ఠిలో ఉంటూ, సర్వ భూత ప్రపంచాన్ని అపార కరుణాదృష్టితో చూడగల అదృష్టం ఉంటే చాలయ్యా!" అన్న శ్రీదాముడు, స్వామికి గంధానులేపనాలను స్వయంగా అలంకరించి తన కుబ్జత్వాన్ని పోగొట్టుకొని అద్భుత సౌందర్యవతియై ఆ అందాన్ని స్వామికే అర్పించుకొని ధన్యయైన కుబ్జ, అబాల్యము స్వామితో కలిసి మెలిసి ఆడిపాడి ఆయన తత్త్వాన్ని అణువణువునా జీర్ణించుకొని జీవిత పథంలో అనయాయియై, అంతేవాసియై అవతార సమాప్తి వేళ ఆయన ఆధ్యాత్మిక సందేశాన్ని స్వీకరించి తరించిన ఉద్ధవుడు, మహాజ్ఞానియై భారత భాగవత కథా ఘట్టాలకు సాక్షీభూతుడై ధర్మప్రవచనశీలిగా శాంతిసంయమన కీర్తిగా సభాంతరాళలో తన ధర్మవాణిని మోగించి అంతరంగంలో స్వామిని నిలుపుకొని వ్యవహరించిన విదురుడు, దివ్యజ్ఞాని మైత్రేయుడు, సజ్జనత్వంలో సామర్థ్యాన్ని మేళవించి ఉద్యోగ బాధ్యతలను మెలకువగా నిర్వహించి కురుక్షేత్ర సంగ్రామ విశేషాలను, గీతాప్రవచనాన్ని సుదూరం నుండి గ్రహించి ప్రవచించిన సంజయుడూ, నరజాతికి ప్రతీకగా నిలిచి సఖుడై సరథియై అనన్యయోద్ధయై గీతామృతధారలను గ్రోలిన

పార్థుడూ, మూర్తభక్తితో స్వామిని చెంగట నిలిపి నిలవరించు కొన్న ఘంటాకర్ణుడూ, అసంఖ్యాక ఋషిబృందమూ, మొదట మొదట భక్తి భేషజంతో స్వామిని విమర్శించి క్రమంగా పరిణామంపొంది

పశ్చాత్తప్తుడై తన దుస్సంస్కారాలను శాశనం చేసికొన్న అక్రూరుడు, చిరకాలార్జిత తపఃఫలాన్ని స్వామిని శపించడానికి ఉపయోగించబోయి, అగ్నిజ్వాలలాగ ఎగిసి మబ్బుతునకలాగ మణిగిపోయి ఆయన అంతర్యామిత్వాన్ని అర్థంచేసికొని తరించిన ఉదంకుడూ — ఇలా ఎందరో ఎందరెందరో!

ఈ అందరికీ పై మెట్టున నందుని మందలో గోపికా బృందం. అసలు యశోదమ్మకి చిన్ని మగశిశువు కలిగాడని విన్నప్పుడే వాళ్ల ప్రాణాలు లేచివచ్చాయి. బిరబిరా చరచరా ఉండకా పరుగెత్తుకొని వెళ్లి పొత్తిళ్ళ శిశువునే గుండెలకు హత్తుకొని ఇదీ అని తెలియని ఓ మధురానుభూతికి గురైనారు. లాలపోయడం, జోలపాడటం, అల్లారుముద్దుగా ఆడించటం, అరచేతుల మీద నడిపించడం — అన్నిట్లో యశోదమ్మ వెం ఉన్నారు. తప్పటడుగులు నేర్చిన ఒప్పులకుప్ప వయ్యా కన్నయ్య ఇళ్లల్లో పాలు, పెరుగు, వెన్నలు దొంగిలించడంతో అందమైన అల్లరి మొదలెట్టి శృతిమించి అనురాగాన పడేట్టు

చేస్తున్నాడు. లోపల ఒక ఆనంధం అనుభూతి, బయటికి ఒక రవ్వరట్టూ. యశోదతో చెప్పుకున్నారు. తల్లీ! మమ్మల్ని పల్లె వదలి వెళ్లిపొమ్మన్నావా! లేక పిల్లాణ్ణి అదుపులో పెడతావా! ఆ తల్లి విస్తుపోయి ఒకటి రెండు సార్లు గట్టిగానే దండించింది. ఏం లాభం! అబ్బాయి అల్లరి ఏమితగ్గలేదు. పైగా ఆయన మీద చాడీలు చెప్పిన వాళ్లే తల్లి దండిస్తుంటే చూడలేక కళ్లనీళ్ల పర్యంతమయ్యారు. రానురాను వారికి అర్థమైంది. కన్నయ్య తమవాడు. ప్రాణనాథుడు. ఏదన్నా వ్రతం చేసి ఆయన్ని భర్తగా పొందితే. ఇంకేం! కాత్యాయనీ వ్రతం నలభై రోజులూ అందరూ కలిసి చేసి అమ్మవారిని ప్రార్థించారు...

కాత్యాయనీ గౌరి కల్యాణి శర్వాణి
కరుణామయీ తల్లి వరదాయినీ
బాలక్రిష్ణుని కోరినాము జన్మజన్మల భర్తగాను
ఇది యేమి నెఱవేరగా రాని కోరికా
మా మోమునే ప్రొద్దుపొడిచెనా యీరికా
కరుణించి వరునొసగి వరమీయవా                కాత్యా

మొలబంటి నీటిలో దిసమొలల నిలిచాము
వలువలెత్తుకపోయినవుడూ

## 15

చేతిలో చిక్కాము చేయెత్తి మొక్కాము
ఎల్లకాలము మాకుదక్కాలనీ మాతే చిక్కాలనీ కాత్యా
కొలని కలువల మల్లె మేము నింగి చందురుడల్లెతానూ
ఎఱ్ఱ సూరీడల్లె తాను ఎఱ్ఱతామరలల్లె మేమూ
అందరిలో తానుండి ఆతనిలో మేముండి
కలకాలము కలిసి కాపురము చేయాలి కాత్యా

అర్థమైంది. జన్మాంతర సంబంధంచేత యశోదపట్టి తమ అంతస్సను ముట్టిపట్టి ఆకర్షిస్తున్నాడు, సంకర్షిస్తున్నాడు వికర్షిస్తున్నాడు. అన్ని ఘట్టాలలో హర్షాన్ని వర్షిస్తున్నాడ వసంతంలో వనాంతర సీమలలో అందరూ గుంపులుగుంపులుగా ముసురుకుంటే ఆటపాటలతో అలరిస్తున్నాడు. గ్రీష్మంలో జల క్రీడలతో క్రీడిస్తున్నాడు. వర్షఋతువులలో పర్వతసానువుల నుండి మేఘమూర్తిలాగా కనుపిస్తున్నాడు. శరత్తులో వేణువు పూరించి ప్రాణవాయువులను ఆసంధపథంలో ఆడిస్తున్నాడు. హేమంత శిశిరాలలో తనలో ఒదిగించుకుంటున్నాడు.ఆ వ్రేతలికి ఇల్లూవాకిల్లు, పిల్లాపాపా, కొంపాగోడూ పట్టలేదు. అంతా క్రిష్ణ మయం. ఒక రసలోకంలో విహారం. కానీ ఏం లాభం? ఈ కన్నయ్య ఎంత మోసగాడో! ఇప్పుడు పక్కనే ఉంటాడు.

ఏడమ్మా క్రిష్ణుడేడమ్మా
అందాల బాలుడూ నందగోపాలుడూ
లాలపోశాము జోలపాడాము
ప్రేమతో లాలించి పెంచాము
పొత్తిళ్లనుండీ కౌగిళ్ళదాకా
అల్లరీ ఆగడమూ సైచాము ఏడ

దొంగపాలు తాగినా వెన్నలు దోచేసినా
లీల లేపోనిమ్మనుకున్నాము
ఆలుమగల సరసాల ఆటలాడుదామంటే
ఆయన దేవుడని జానన్నాము ఏడ

వెఱ్ఱెత్తిపోయాము వేణువూదితే
శివమెత్తి ఆడాము చిందువేస్తే
జలకాలాటలో పులకించాము
రాసలీలా కేళి మై మరచాము. ఏడ

మారీడు వాడలో చుక్కల నీడలో
మల్లియల మాటున నల్లని కాళిందిలో
వెన్నెల రేలలో కన్నియల గుండెలో
అక్కడో ఇక్కడో ఎక్కడో దాగాడు ఏడ

ఎంత వెదికినా కనుపించదు. ఎన్నాళ్ళీ అన్వేషణ. ఎన్నాళ్ళీ ఆరాధన. అయినా తప్పదు. అతను కనబడితీరాలి. ఇంకా ఎలుగెత్తి పాడారు. దిక్కులు దద్దరిల్లేలాగ విలపించారు.

ఎందున్నావని ఎందు లేవనీ
ఏరూపమ్మనీ వెదకమురా
కన్నులు కాయలు కాచెనురా
కనుపించమురా గోపాలా
పూలరేకుల రంగులలోనా
నీలిమబ్బుల నీడలలోనా
నెమిలి పింఛాల హరివిల్లులోనా
అరుణ కిరణాల సిరిజల్లులోనా ఎందు
గువ్వ జంటల గుసగుసలోనా
కొండ వాగుల జలజలలోనా
జలదరించిన కోనలలోనా
ఊసులెరుగని బాసలలోనా ఎందు
పొదల కదలే వెదురులలోనా
గాలి యీలల జాలులలోనా
సరళ మురళీ రవళులలోనా
మౌనగానాల తానములోనా ఎందు

కన్నయ్య విన్నాడు. కళ్ల ఎదుట నిలిచాడు. అసలు ఎక్కడికైనా వెళితే కదా! మళ్లీరావడానికి. అందర్నీ కూర్చో బెట్టుకొని ముచ్చటగా చెప్పాడు. ఎంతవాళ్లకైనా ఇళ్లూవాకిళ్లూ వదిలిపెట్టి అర్ధరాత్రి అన్నెకారి బయలుదేరి వచ్చి లోకులు ఏమనుకుంటారో! అనికూడా లెక్కచేయకుండా ఇలా నావెంట బడుతున్నారే! ఇల్లాంట్రు మీకిదేమన్నా బాగుందా? అన్నాడు. "మాకిదే బాగుంది. మా యిల్లూవాకిలీ, పిల్లాపాప, భర్త బంధువూ అన్నీనీవే. ఎందుకయ్యా! మమ్మల్ని ఇంకా పరీక్షిస్తావు. అర మరికలు వదలేసి ఆత్మారాముడవై నీలోకలుపుకో". అన్నారు ఒకే గొంతుతో 'అవును మీరు చెప్పిందే బాగుంది, నా కోసం అన్నిటినీ తెంచుకొని వచ్చిన మీ ఋణం ఎన్ని జన్మల కైనా తీరదు. మీకో వరం ఇస్తున్నాను. నన్నెప్పుడూ మరువ కుండా ధ్యానించి తరించగల మనస్సు. అదే మీ తపస్సు' అంటూనే ఒక రమణీయ లయాన్విత రసగానకేళిగా ఆ దృశ్యం మార్చేశాడు.

నంద బృందావని సుందరారామమూ
రాసలీలా మహోల్లాస విన్యాసమూ
గోపికా బృంద గోపాలికా లాస్యమూ
విశ్వ సంగీతరంగీకృతానందమూ

మంజు మంజీర శింజాన మాధురీ
వేణువీణా మృదంగాల లాహిరీ
నాదమోంకారమై వేద ఝుంకారమై
రోదసీ మేదినీ స్పందనా నందమై నంద

తరులతాగిరిఝరీ తాళలయలలో
తారకాగోళములే కరిగిపోయేనూ
నింగి తాకింది కాళింది పొంగి
వెల్లువై వెన్నెలై నింగి జారెనూ నంద

గోపికా హృదయరంగాన క్రిష్ణుడూ
క్రిష్ణచైతన్య సంసక్త గోపికా
గోపికా లాస్యమూ క్రిష్ణ సంగీతమూ
క్రిష్ణ లాస్యంబులో గోపికాగీతమూ నంద

ఆటలాడింది మై మరచి కేకినీ
పాటపాడింది గొంతెత్తి కోకిలా
పొదుగుచేపింది గోమాత గోముగా
పులకరించింది భూమాత పచ్చగా . నంద

కాళిందీ ప్రవాహం కాలగమనాన్ని సూచిస్తూ కదలి
పోతున్నది. ఒక ప్రభాతవేళ గోపికల హృదయపథాలను చీలుస్తూ

ఆశాసౌధాలను కూలుస్తూ అక్రూరరథం క్రిష్ణుణ్ణి తీసికొని మధురాపుర మార్గం పట్టింది. కొన్నేళ్ళకి ఇన్నేళ్ళగా చెట్టునూ పుట్టనూ, కొండనూ కోననూ. వాగునీ వంకనూ, గాలినీనేలనూ ఓపికలేని గోపికలు మా కన్నయ్యయేడీ? మళ్ళీమందకి వస్తాడా! రాడా! అంటూ అదే పనిగా వెదుకుతున్న వేళ అయసలాగే అందంగా నల్లమబ్బుతునకలాగ ఉన్న ఉద్ధవుడు క్రిష్ణ సందేశాన్ని తీసికొని నందవ్రజానికి వచ్చివాలాడు. తుమ్మెద మీదపెట్టి ఆయన్నీ, అసలు కబురంపిన ఆయన్ని దులిపేశారు.

గోపాలుడేడమ్మ తుమ్మెదా
గోవిందుడేడమ్మ తుమ్మెదా
మాకంటి పాప మా యింటివెలుగు
మమ్మల్ని మరిచాడ తుమ్మెదా
నాగరికము నేర్చి తుమ్మెదా నగర
కాంతల్ని మరిగాడు తుమ్మెదా
కల్లా కపటంలేని రేపల్లె కన్నెలను
నట్టేట ముంచాడు తుమ్మెదా — గోపాలు

ఇదిగో వస్తానని ఒట్టేసి నమ్మించి
అదె పోతపోయాడు తుమ్మెదా

వీళ్లూపూళ్లూ గడిచె తుమ్మెదా
మా కళ్ల కాయలు గాచె తుమ్మెదా గోపాలు
నమ్మిన వారము తుమ్మెదా మమ్ము
వంచింప రాదమ్మ తుమ్మెదా
వేగమ్మె రమ్మని మమ్మేలు కొమ్మని
వెన్నదొంగకు తెలుపు తుమ్మెదా గోపాలు
గోపాలుడైనా భూపాలుడైనా
మాపాలి దేవుడు వాడే
ఈ జన్మకైనా ఏ జన్మకైనా
వదిలేది లేదమ్మ తుమ్మెదా గోపాలు

దిమ్మ తిరిగిపోయిన ఉద్ధవుడు అవాక్కై అయ్యాడు స్వామికి తనలాంటి భక్తులే కాక ఇలాంటి ఆత్మానందకీర్తులు కూడా ఉన్నారని తెలిసికొని వాళ్ల పాదధూళి శిరసున చల్లుకొని చేతులు జోడించి వెళ్లిపోయాడు.

కాలం గడుస్తున్నది. యమున గోపికల కథలను, వ్యథలను, రోదలను తనలో లీనం చేసుకుంటూ ప్రవహిస్తున్నది. ఒకనాడుమందలోని గోపికలకు క్రిష్ణుడువచ్చాడనికబురుతెలిసింది లేడిపిల్లలాగ, కొండవాగుల్లాగ, ఒక్క ఊపులో ఊరిపొలిమేరకి చేరారు. అందాల బాలుణ్ణి డెందాలహత్తుకొని మునుపటిలాగే

ఆటా పాటా చనువూ సంబరమూ కలబోసుకుంద్దామనీ, కలసి ఉందామనీ—పరకాయించిచూచారు. అదొక అసహ్యాదృశ్యమైె వారి కళ్ళకి హత్తి మొగం మొత్తింది. బాగా ఎదిగిపోయిన రాజులాంటి క్రిష్ణుడు, బంగార్రు రథాలు, అందులో అష్టమహిషులు ఆ పైన మందీ మార్బలం, ఒళ్లుమండి గిరుకున్న తిరిగిపోతున్న గోపికల వెంట పరుగెత్తి చేతులుజోడించి క్రిష్ణుడు—

| | |
|---|---|
| ఓ గోపికలారా | రాజవేషధారీ! |
| నా హృది దీపికలారా | రారాజమకుటధారీ |
| ఏమి కోరి వచ్చారు | ఏమి కోరలేదు |
| ఏమి కానుకలు తెచ్చారు | కానుకలేవి లేవునీకు |

ఆటపాటసయ్యాటల మిమ్ముల
అలరింపగ వచ్చాను
పాలు వెన్న మీగడకోరి
పరుగున వచ్చాను ఓ గోపిక
మిసమిసలాడే పసితనమందు
పాల మీగడలు పెట్టాము
మనసులు కలిసిన మంచిముహూర్తమున
ఆటకు వచ్చాము ఓ రాజ

రాచ వేసమును చూచి మీరు నను
రట్టుచేయకండీ
రాజునైన రంగప్పనైన మీ
వాడనంచు నమ్మండి ఓ గోపిక

చూడదలిచినాము గో
పాల బాలు మేము
చూడదలచలేదు రాజుల
సోయగాలు మేము ఓ రాజ

ఆటల పాటల అలరిన ఘడియల
మరువక రారండీ
మనసులు కలిపి మమతలు నిలిపి
మసలగ రారండీ ఓ గోపిక

మచ్చిక మన్నన అచ్చట ముచ్చట
చెల్లిపోయెనయ్యా
వచ్చిన దారిన వెళ్లవచ్చునని
హెచ్చరిస్తిమయ్యా ఓ రాజ

సంవాదం ముగిసింది, హార్దిక సంయోగం కలుగలేదు.
ఎలాగు వచ్చానుకదా! అని సకుటుంబంగా నందయశోదల

వాత్సల్యామృత ధారలలో స్నానమాడి, ఆశీస్సులందుకొని ఆతిథ్యం స్వీకరించి గాలికి ధూళికి తెలీకుండా గుట్టు చప్పుడు కాకుండా అష్టమహిషులతో, బంగారు రథాలతో శ్రీకృష్ణస్వామి మధురకు బయలుదేరి వెళ్లాడు.

కాలచక్రం తిరుగుతోంది. కాలంది సాగర సంగమానికి ఉన్ముఖంగా పరిగెత్తుతున్నది. దశాబ్దాలు కాలగర్భంలో లీనమై పోయయి. ఈలోపున రాజకీయాలు, రాయబారాలు, సంగ్రామాలు, సంరంభాలు ఎన్నో మలుపులు తిరిగి ఆర్యావర్త మంతా కురుక్షేత్ర సంగ్రామంలో అలసి సొలసి కాగి చల్లారిన పాల కుండలాగా ప్రశాంత గంభీరంగా ఉన్నది.

ఒక సూర్యగ్రహణ సందర్భంగా దేశదేశాల రాజులూ రంగప్పలూ, జనసామాన్యమూ, ఆబాలగోపాలమూ ఇసుకవేస్తే రాలకుండా యమునా నదీతీరాన గుమిగుడారు. శ్రీకృష్ణస్వామి సకుటుంబ పరివారం మహావైభవంగా యాదవ పాండవాది రాజ వంశ బంధు సంబంధులతో బయలుదేరి వచ్చారు. వచ్చిన వాడు వేయి కళ్లతో జనసందోహాన్ని వెదికి పరీక్షిస్తూ ఇసుక తిన్నెలపై ఓ మూల శరత్కాలము మబ్బులాగ, వెండి వెలుగు ముద్దలాగ, ఆవునేతి దీపాల్లాగా ఒదిగిఉన్న గోపికలను కనిపెట్టి

చెంతచేరి కుశలప్రశ్నలతో లాలించి, చిరునవ్వులు చిందించి, ఆర్ద్రంగా ఆదరించి వెలుగులు విరజిమ్మే వాళ్ళకళ్లలోకి చూస్తూ అప్పటిలాగ మళ్లీ ఆటపాటకు అవునంటారా! అన్నాడు. గోపికలు గొంతు సవరించారు. మునుపటిలాగ ఉద్వేగం లేదు. ఆవేశం లేదు. రాగంలేదు. అనురాగంలేదు. ఉన్నది ఒకేశాంతి. ఒకేకాంతి మౌనరాగం లాగ వేదనాదంలాగ తపస్సు పండినట్టు మహస్సు నిండినట్టు---

ఏనాడో ఒకటైనాము
ఏటినీటి తరగల్లాగ
ఈ నాటికి విడిపోయాము
గాలివాలు మబ్బుల్లాగా
చలిదన్నపు సంబరాలు
జలకేళీ సంభ్రమాలు
రాసగాన విన్యాసాలు
మరువలేని మాధుర్యాలు  ఏనాడో

బృందావన జీవనగాథ
మామదిలో చెరుగని బోధ

రసలోకపు రమ్యవాటిక
నీ వొసగిన మోక్షపేటిక ఏనాడో

ఏమి మిగిలెను నినుకోరుటకు
స్వామీ నీ పద సన్నిధిచాలు
ఎల్లవేళ మా యుల్లములో
నిలుపుమయ్యా నీ పదయుగళి ఏనాడో

వారి కోరిక విని స్వామి ఆనందించి చిన్ముద్రతో ఆమోదించి "అంతకంటేనా! అసలిందుకేకదా! మనకథా గాథా" అన్నారు.



# గీతాకృష్ణ

## పరిచయం

కృష్ణావతార కథాఘట్టాలలో పరాకాష్ఠ గీతోపదేశం. సాక్షాత్తు భగవానుడు లోక సంగ్రహార్థం జగద్గురువై నరుని నిమిత్తంగా చేసుకొని మానవజాతికి ప్రసాదించిన బ్రహ్మవిద్య. ఉపనిషత్తు, యోగశాస్త్రం. అందులో ఆబాల్యం ఆయన జీవించి భావించి నిరూపించిన తాత్త్వికసత్యాలు, సృష్టిలో భూత భవిష్యద్వర్తమానాలలో ఎప్పుడూ తప్పిపోని ఆధ్యాత్మిక జ్ఞాన సమన్వయం, అన్నిటినీ మించి మానవుని జీవనమార్గం -- ఇలా ఎన్నో అంశాలు చోటుచేసుకున్నాయి. ఎప్పుడెప్పుడు మానవ జీవితంలో ధర్మనిర్ణయ సమస్య ఏర్పడుతుందో అప్పుడప్పుడు భగవద్గీత సమస్యను పరిష్కరించి ధర్మనిర్ణయం చేస్తుంది. ధర్మ క్షేత్రమైన కురుక్షేత్రంలో అష్టాదశాక్షౌహిణులు సమరసన్నా

యాతుధానులు రక్కసులు నా
చేత చచ్చుట నీవెఱుంగవెః — గీత

క్షాత్రధర్మము కఠినమైనది
శత్రుమిత్రాతీత సాధన
క్షుద్ర దౌర్బల్యమును వీడుము
క్షాత్ర ధర్మము నిర్వహింపుము — గీత

దుఃఖమున మది క్రుంగగూడదు
సుఖము నందున పొంగగూడదు
ద్వేషరాగ భయమ్ములందక
స్థితప్రజ్ఞుడవై చరింపుము — గీత

వింటిదాలిచి ముక్కంటిపోలిక
విజయుడాః యిక విజృంభింపుము
ధర్మ యుద్ధము తప్ప క్షత్రియు
డన్య మార్గము ననుసరింపడు — గీత

నందవ్రజమున నాదుజీవిత
పథము నించుక మదిని నిలుపుము
అపుడు నెరపిన లీలలోనా
తత్త్వమును నీ వెఱుగవలయును — గీత

2. ఆలగాచితి పాలదీసితి
ఆరగించితి వెన్నమీగడ
ఆర్త దీనానాథజీవులు
కందులో భాగమ్ము నొసగితి

హలముఖమ్మున పొలము దున్నితి
సస్య సంపద పెంపునందగ
నేను నాదను తలపునెఱుగక
సర్వ జనులకు సమర్పించితి

మేఘములు వర్షించునెందుకు
సస్యముల పండించునందుకు
సస్యముల భూతాళి బ్రదుకును
భూత చేతన మనిన ఆత్మయె

యుగయుగమ్ముల జగతి నిరతము
యాగమొక్కటి సాగుచున్నది
యాగమన్నది క[illegible]నము
కర్మమే బ్రహ్మమ్ము పొద్దా

యాగమున భాగమును పొందిన
బ్రహ్మభావుడు ముక్తసంగుడు

స్వార్థమున శ్రమియించువానికి
ఇహము పరమును రెండు దక్కవు

కర్మయోగివి కమ్ముపార్థా
ధర్మజీవన పధము నందున
హలము పట్టిన జనకు పోలిక
ధనువు దాల్చిన దాశరధివలె

3.4 ఎప్పుడెప్పుడు ధర్మమణగియ
ధర్మమార్గము లతిశయించునొ
అప్పుడవతారముగవత్తును
ధర్మ సంస్థాపనము సలుపగ

సాధు సంరక్షణము సల్పి అ
సాధు శిక్షణ సూవరింపగ
యుగయుగమ్ముల నవతరింతును
జగతి ధర్మము పొదుగొలుపగ

ఎవరు నన్నేరీతి చేరుదు
అటులె వారికినట్లె దొరకుదు
కర్మలందున కర్మఫలముల
బంధమెఱుగని పధమునాయది

నీవు సారధ్యము కోరితివి రా
రాజు రణమును కోరుకొనెను
ధర్మజుడు ధర్మమును వలచెను
ద్రోవదికి పగ తీరవలయును

పనులనిన్నిటి బ్రహ్మభావన
ముక్తసంగుడనై ముగించెద
సర్వమును బ్రహ్మార్పణమ్ముగ
జ్ఞానయజ్ఞము నాచరింతును

జ్ఞాన సదృశమేదియును లే
దజ్ఞాన స్పర్శను వీడు పార్థా
తప్పులెల్లను జ్ఞానమందున
కలసిపోవును కాలక్రమమున

అట్టి జ్ఞానము నందవలెనో
అర్జునా నీ యట్టి వీరుడు
పరిప్రశ్నల సేవలను ప్రణి
పాతమున బహుజన్మ ఫలముగ

5. రాజసూయము నందు చైద్యుని
నిందవిని దుఃఖమ్మునందను

అగ్రపూజా భాజనుడనై యా
నంద భావము నందబోవను

రాయబారము విఫలమందగ
రాజసభ దుఃఖించినది తే
దాహవమ్మున జరుగుహింసకు
ఆత్మలో నల్లాడబోవను

విద్యనేర్చిన విప్రులైనను
గోవులైనను గజములైనను
శునకమును చండాలునొక్కటు
సమముగా దర్శనము సలుపుదు

అట్టి సన్యసనమ్ము నభ్యా
సార్థివై నీ వలవరింపుము
కర్మయోగము కన్న తత్ఫల
సన్యసనమే మిన్న పార్థ!

6. జీవితమ్మొక యోగసాధన
మన్నభావము మోక్షసాధన
జ్ఞానకర్మ తపమ్ములకు పై
నున్న యోగము మిన్న పార్థ!

శీతముష్ణము సుఖముదుఃఖము
మానమవమానమ్ము నొక్కటె
మన్నురాయియు స్వర్ణమొక్కటె
అన్నిటిలో తానన్నదొక్కటె
శత్రుమిత్రత్వములు బంధుత్వమ్ము
ద్వేషము సంహారింపుము
ఆత్మతత్త్వమునన్నిటిలో సమ
దృష్టి గాంచుము యోగివగుదువు
వేయిమందిలో నొక్కడెవ్వడో
పండితుండగు పార్థ నిజముగ
అట్టివారిలో నొక్కడెవ్వడో
నన్నెఱింగెడివాడు పుట్టును
అట్టి వానికి అన్నిటిలో నా
తత్త్వమే భాసించుచుండును
అదియె శాస్త్రమ్మదియె వేదము
అదియె పూర్ణమైన జ్ఞానము
భూజలాగ్నులు వాయుగగనము
మనో బుద్ధులు నహంకారము

అష్టప్రకృతులైన నాదగు
సృష్టినెప్పుడు కాచుచుంతును
దీని కన్నను పైన నున్నది
నవమ సంఖ్యము నాదుప్రకృతి
పరానామము పై నదానికి
నాదు తత్త్వము కలదు పార్థ

అష్టప్రకృతులష్టమహిషులు
పైన రాధది పరాప్రకృతి.
రాధహృదయారామసీమల
రాజ్యమేలుట రహస్తతత్త్వము.

ఎందరో దుష్కృతులు మూఢులు
నన్ను కాదని మాయలో బడి
దాటజాలని బాటనడచుచు
జన్మజన్మల గడపుచుందురు

ఆర్తుడర్థార్థియును జిజ్ఞా
సువును జ్ఞానియు సుకృతులౌదురు
అందునజ్ఞానియె నాకు ప్రియతము
డట్టి జ్ఞానము నీవు పొందుము

అందుకొక్కటె సులభమార్గము
అన్నిటను నను గాంచుచుండుట
వాసుదేవుడే సర్వమని భా
వించు వాడే మహాత్ముండగు

అట్టివానిని జరామరణము
లెట్టులైనను మ్రింగజాలవు
ద్వంద్వ భావాతీత తత్త్వము
బ్రహ్మభావము వాని జెందును

8. అక్షరమై బ్రహ్మభావన
అట్టివానిని ఆహరించును
అదియె ఆధ్యాత్మికము పార్థా
అదియె సర్వాతీతయజ్ఞము

ఎల్లకాలము మనోబుద్ధుల
నుల్లమున నను నిలిపి నడువుము
యుద్ధమైనను శాంతియైనను
శుద్ధధర్మమ్మగును నాయెడ

బ్రహ్మరూపమ్మైన ప్రణవము
నన్ను తలచుచు వ్యాహరించుచు

దేహబంధములను త్యజించుట
పరమపదవికి భవ్యమార్గము

9. తపము యజనము దానవిరతియు
కలుగ వలయునె నన్ను చేరగ
పత్రపుష్ప ఫలమ్ము జలమును
భక్తితో నర్పించు చాలును

మాలకరి యొక మాలనిచ్చెను
చెల్లి ద్రౌపది చల్లిమెదుకిడె
బడుగు బాపడు అటుకలలిచ్చెను
సంతసించితి మదిని మెచ్చితి

రాజయోగము రాజవిద్యా
గుహ్య మార్గము కలదుపార్థ
ధర్మ సుఖముల నవ్యయమ్మగు
కర్మ మార్గము కలదు పార్థా

దాని నెఱుగుట ఉత్తమము మరి
దాని నేర్చుట సర్వశ్రేష్ఠము
మృత్యు సంసారముల వీడెడు
ముక్తిపదసోపాన మార్గము

ప్రకృతియంతయు నాకు వశమై
పార్థ సంచరణమ్మ్మ సలుపును
అందునే వ్యాపించియుందును
ఆకసమ్మున అనిలు రీతిగ

భూత చేతన కర్మమర్మము
నన్ను చెందవు నన్ను పొందవు
మూఢులందరు నన్ను కేవల
మానుషమ్మగు మూర్తి గాంతురు

జ్ఞానులందరు నాదు దివ్య
జ్ఞానమూర్తినె యుపాసింతురు
రాజయోగులు యోగమూర్తులు
జ్ఞాన విజ్ఞానముల మూర్తులు

నేనె యజ్ఞము నేనె మంత్రము
నేనె ఆజ్యము నేహవిస్సును
అన్న భావన ఉన్నవారికి
సర్వమున నేనున్నవాడను

అన్యచింతలు లేకనన్నే
పర్యుపాసన జరుపువారల

యోగమును క్షేమమ్ము నేనే
జాగరూకత కాంచుచుందును

నందరాజు యశోద గోపి
గోప గోగణముద్ధవుందును
మొదలుగాగల మోక్షకాములు
నన్ను మరచి మనంగజాలరు

కర్మ బంధములందు తగులరు
ధర్మభావము వీడజాలరు
ఎల్లవేళల అట్టివారల
ఉల్లముల నే నిలిచియుందును

ఎల్లభూతములందు సముడను
ప్రియులు ద్వేష్యులు నాకు కలుగరు
భక్తి కలిగిన సర్వభూతము
లందునే కరుణార్ద్రమూర్తిని

యాదవుల ఆర్ద్రముగ చూతను
కౌరవులపై కక్ష పూనను
రాగద్వేషములందు వారే
చిక్కుకొని చిక్కులను పొందిరి

క్రిష్ణభావాకలితునేనీయు
దుష్టరాక్షసగణమునేనియు
శత్రువై నను కటాక్షించెద
శరణమందిన నభయమిచ్చెద

మనసునందున నన్నెనిలుపుము
భక్తితో నను సేవచేయుము
నాకు మొక్కుము నీకెచిక్కెద
ఇంతకన్నను ఏమి కావలె

భూతభావన చేతనమ్మును
సర్వమును నే నిండియున్నను
కొన్ని నా విభవములనెన్నెద
ఎన్నడును మరువకుము నీయెద

0. సమత తుష్టి అహింసదానము
తపము యజ్ఞము నా స్వరూపము
సకలసృష్టికి ఆదిమధ్యాం
తముల యందున నేనెయుందును

విష్ణువుల ఆదిత్యుడను జ్యోతి
ర్మూర్తులను రవినంశుమంతుడ

మరీచులలో మారుతమ్ముడను న
నక్షత్రముల యందేను చంద్రుడ
వేదములలో సామవేదము
దేవతలలో ఇంద్రదేవుడ
ఇంద్రియమ్ములలో మనస్సును
భూతములలో చేతనమ్మును
రుద్రులందున శంకరుడనే
యక్షులందున కుబేరుండను
వసువులందున పావకుండను
శిఖరరాజములందు మేరువు
పురోధసులలో బృహస్పతినని
పార్థ! నను గుర్తించవలయును
వాహినీ పతులందు స్కందుడ
సాగరుండను రసములందున
ఋషివరేణ్యుల యందు భృగువును
అక్షరమ్ముల ప్రణవమూర్తిని
యజ్ఞముల జపయజ్ఞమూర్తిని
స్థావరమ్ముల హిమాలయమును

వృక్షముల నశ్వత్థమును నే
దేవమునులలో నారదుండను
గంధర్వరాజుల చిత్రరధుడను
సిద్ధులందున కపిల మౌనిని

అశ్వముల నుచ్చైశ్రవమ్మను
ఏనుగుల నైరావతమ్మను
నరులలోపల క్షత్రియుండను
నరుడ నను గమనించిచూడుము

నాగములలో అనంతుండను
యాదసులతో వరుణదేవుడ
పితరులందున అర్యముడనే
సంయముల యమమూర్తి నగుదును

దైత్యులలో ప్రహ్లాదమూర్తిని
కాలమున కదిలించుశక్తిని
మృగములందున సింహమునునే
పక్షిజాతుల గరుత్మంతుడ

కదలు వానిలో గాలిదేవుడ
ధనుర్ధారుల రామదేవుడ

జల చరమ్ముల మొసలినగుదును
స్రోతములలో జహ్నుతనయను
సృష్టికాదియు మధ్యమంతము
నన్ను బట్టియె నడచుచుందును
విద్యయందధ్యాత్మవిద్యను
వాదనిపుణుల వాదశక్తిని

అక్షరమ్ముల అకారమ్మును
ద్వంద్వమును సామాసికమ్ముల
విశ్వ సృష్టికి ధాతనగుదును
అక్షయుండను అన్నివేళల

మృత్యుమూర్తిని సృష్టికర్తను
కీర్తిమూర్తిని వాఙ్మయుండను
స్మృతిని మేధను ధృతిని క్షమను
సర్వశ్రేష్ఠార్థముల శక్తిని
సామములలో బృహత్సామను
ఛందముల గాయత్రినగుదును
మాసములలో మార్గశీర్షము
ఋతువులందున వసంతమ్మును

తేజమును జయతత్త్వమును
వ్యవసాయ సత్త్వముల్ందునేనై
వివిధరీతుల విలసనమ్ముల
విస్తరించుచు నుందు పార్థ!

వృష్ణికులమున వాసుదేవుడ
పాండవులలో ధనుంజయుడను
మునులలో వ్యాసుండనేనే
కావ్యకర్తల నుశననుండను

ఎన్నిరీతుల నెన్నిచూచిన
ముగియబోవదు నాదు విభవము
సృష్టియందలి సర్వవిభవము
నా విలాసమ్మనుచు తెలియుము

11. అనన్య మా నీ అనుగ్రహమ్మున
అధ్యాత్మ భావన ననుగ్రహించితి
నశియించె మోహము లభించెజ్ఞానము
యోగేశ్వర పరమేశ్వర కృష్ణ!

సర్వవిశ్వ సంసక్త వైభవము
సర్వయోగి సంస్తుత్య రూపమును

కన్నులార నే కాంచగోరితిని
అర్హుడనగుచో అనుగ్రహింపుము

అనిన అర్జునుని అల్లన చూచుచు
మెల్లమెల్ల తెలికన్నుల నవ్వుచు
చర్మ చక్షువులు చాలవు పార్థా
దివ్య చక్షువుల నిచ్చెద చూడుము

అని తన సర్వాంతర్యామి రూపమును
విశ్వమెల్లెడం విన్యసించె హరి
విశ్వరూప సందర్శన హృష్టుడు
విజయుడిట్లు స్తుతి చేసెను స్వామిని

ఎన్ని బాహువులు ఎన్ని ఉదరములు
ఎన్ని వక్త్రములు ఎన్ని నేత్రములు
ఎచట మొదలు తుది యెచటనున్నయది
తేరి చూడగా రాని రూపమున

అక్షరమౌ నీ అనంతరూపము
పరమతత్వ్రప్రతిపాదక మౌ గద
అవ్యయ శాశ్వత ధర్మగోప్త నీ
కంజలించెదను భీత భీతుడను

రుద్రాదిత్యులు వసువులశ్వినులు
సిద్ధసాధ్య గంధర్వ కిన్నరులు
అణువు మొదలు బ్రహ్మాండమంతయును
అనంతమగునీ ఆకృతి నిలిచెను

నదులన్నియు సాగరము చేరుగతి
నరులందరు నీ వదనము జొచ్చిరి
కరాళమగు నీ కోరల చిక్కిరి
తిరిగిరాని పథమందున నడిచిరి

ఇంత భయంకర మగు నీ రూపము
నెట్లు గాంచగలనయ్య జనార్దన
కరుణతోడ నుపహరింపవలె
సౌమ్యరూప సందర్శన మీవలె

అవును స్వామి యిపుడర్థమైనయది
విశ్వమూర్తి నీ విరాట్ తత్త్వము
తప్పులెన్నొ నా వలన జరిగినవి
గొప్ప మనసుతో నను మన్నింపుము

సఖుడవనుచు సరసమ్ములాడితిని
బావమఱదియని భావించితిని

ఓ యాదవ శ్రీకృష్ణాయనుచును
విహరణ శయ్యాసనముల మెలగితి
తపోయజ్ఞముల దానము చేతను
కఠోర దీక్షా సాధనవలనను
దుర్లభమో యీ విశ్వదర్శనము
భక్తసఖుడవౌ నీ కొసంగితిని

కాలుడను లోకాలనన్నిటి
పుట్టి పెరిగి గిట్టింపజేసెదను
విశ్వమందున నేను కానిది
నశ్వరమ్మో నరుడ ఎఱుగుము

చిన్ననాటను మన్నుతింటి
నటించు దండన చేయు తల్లికి
నోటిలో సచరాచరమ్ముల
చూపి లీలను చూపినాడను

తల్లియుల్లము పల్లవించెను
బిడ్డదేవుండనుచు మురిసెను
తల్లిదనమును వీడక యెవా
త్సల్యమున సేవించి మించెను

గుడ్డిరాజుకు గూడచూపితి
విశ్వరూపము విపులసభలో
పాపమంధుడు పాయకుండెను
మామకమ్మగు మోహబంధము.

చూడు పార్థా! నీకు చూపిన
రూపమదృష్టమున పూర్వము
నిత్య ఋతమిది సత్యగతి యిది
ఋషులకేనియు దక్కరానిది

వింటి చాల్పును వేగముగ ము
క్కంటిపోలిక పగర చంపగ
చంపుటకు నీవెవ్వడవు వా
రెవ్వరో నీ చేత చావగ

కర్ణశల్యులు ద్రోణ భీష్మ
ప్రభృతి శత్రుగణంబు లెల్లరు
గర్వ నిర్వాపణమునందిరి
పూర్వమే నా వలన గ్రుందిరి

నీవు కేవల నిమిత్తుండవు
నాకు శిష్యుడవును సఖుండవు

గాన నీకు లభింపనున్నది
యశము విజయము నాదు సన్నిధి

12. చిత్తమందున నన్ను నిలుపుచు
నిత్యమెవ్వండుపాసించునో
అట్టివానిని అంటుజాలవు
మృత్యు సంసారాది బాధలు

సత్వజీవులయందు మైత్రియు
కరుణ కలిగిన వాడుగాంచును
నిర్మమత్వము నిరహంకారము
మోద ఖేదా తీత భావన
అట్టి వాడే నాకు ప్రియతము
డట్టివాడే భక్త సత్తము
డట్టి ద్వంద్వాతీత సుస్థితి
నందవలెనో అర్జునా!

13, 14, 15, 16, 17, 18

క్షేత్రక్షేత్రజ్ఞుల జ్ఞానము
ప్రకృతి పురుషుల శాశ్వతత్వము
పూర్వ ఋషి సంప్రోక్త రీతిని
సర్వమును గ్రహియింపగావలె

సత్త్వ రాజస తమో గుణముల
సత్త తెలిసి వివేచనమ్మన
మూడు గుణములు లేనిముక్తికి
పాటుపడుటే భవ్యసాధన

అట్టి సాధకుడాశ్రయించును
అవ్యయమ్మగు దివ్యపదమును
పురుషోత్తమ పుణ్యతత్త్వము
పరమమగు నా భవ్యధామము

దివ్య సంపదలాశ్రయించుచు
అసుర సంపద పరిహరించుచు
శాస్త్ర ప్రామాణ్యమును నిలుపుచు
సాధకుడు సాధించు మోక్షము

శ్రద్ధలందున గూడ సాత్త్వక
రాజసిక తామసికములున్నవి
ఫలములందున ఆశలేనిది
పరమశ్రద్ధయె సాత్త్వికమ్మగు

అట్టి భావన అట్టిసంపద
అట్టిశ్రద్ధలనాశ్రయించుము

ముక్త సంగుడవై మెలంగుచు
ముక్తిపదము సమాశ్రయింపుము

క్షత్రియుల కర్తవ్యమైచను
దుష్టశిక్షణ శిష్టరక్షణ
స్వీయధర్మము ననుష్ఠించుట
శ్రేయముల సిద్ధింపజేయును

చేతమున నీ సర్వకర్మల
యుద్ధమున నీ అహంకారము
సన్యసింపుము నాడుసన్నిధి
అదియె నీ కర్తవ్యసేవధి

సర్వభూత హృదంతరమ్ముల
నీశ్వరుడనై నిలిచియుందును
సర్వభూతమ్ములను త్రిప్పును
రూఢమే నా మాయ యంత్రము

కాన నన్నే శరణమందుము
కర్మఫల త్యాగమ్ము సలుపుము
నన్ను శరణము నందువారిని
ఎన్నడును నే వీడబోవను

894.8131
RAD



Acc. NO.
1848

సర్వ ధర్మత్యాగియై
సర్వాత్మనా నను శరణమందిన
ఎట్టి పాపములంటకుండగ
ఎల్లపుడు కాపాడు చుండెద

పార్థ నీమది సందియమ్ములు
తొలగిపోయెన నాదుపలుకుల
విన్న మాటల విమర్శింపుము
నీకు తోచిన రీతి నడుపుము

సదమలములౌ నీదు వాక్కుల
సందియమ్ములు తొలగిపోయెను
నీదు మాటయె వెలుగుబాటగ
వీర విజృంభణము సలిపెద

ఎచట యోగేశ్వరుడు కృష్ణుడు
ధనుర్ధారి నరుండు నిలుతురొ
అచట తప్పక అధివసించును
నీతి భూతియు సిరియు విజయము

